ప్రజాపక్ష

# సమీక్ష

3

ఫిబ్రవరి 1-15, 2003 | సమతా పబ్లికేషన్స్ ప్రచురణ | వెల రు. 5-00



లోపలి పేజీల్లో.....



వార్షిక చందా రూ॥ 120/-లు

Edited, printed and published by
**V. Hanumantha Rao**
for **Samata Publications**
D.No. 8-3-898/22, Road No.3,
Nagarjuna Nagar,
Hyderabad - 500 073.
Phone : 23748672

DTP at : Sri Sai Shamili Graphics
Golnaka, Hyd. Ph. 2756 9274

Printed at : Charita Graphics
Chikkadpally, Hyderabad - 020.

## బడ్జెట్ సర్కస్

మరో ముసాయిదా బడ్జెట్ వచ్చేసింది. మొత్తం అధికారులంతా ఓ పక్షం రోజులు బడ్జెట్ కసరత్తుచేస్తారు. అపుడు అసలు బడ్జెట్ సాక్షాత్కరిస్తుంది. ఇదంతా పారదర్శకత పేరుతో జరుగుతున్న సర్కస్. ముందస్తుగా బడ్జెట్ విడుదల చేయటం హర్షణీయమైనది. గత సంవత్సరంలా కేవలం ముసాయిదా బడ్జెట్ పత్రమే కాకుండా, వివిధ శాఖలు కూడా తమ తమ ఆచరణ పత్రాలను పుంఖాను పుంఖాలుగా విడుదలచేసి బోలెడంత సమాచారాన్ని ప్రజల ముందుంచడం బాగానే వుంది. కాని, ఆ పత్రాలను చూస్తే, తలబద్దలు కొట్టుకుంటే తప్ప ఒక పట్టాన అర్థం కాని స్థాయిలో వున్నాయి. సామాన్యుడి సంగతి చెప్పనక్కర్లేదు. ప్రజలముందుంచే పత్రాలు వారికర్థమైన భాషలో వుండాలి. వారెదుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి ఏమేమి కేటాయింపులు చేశారో వాళ్ళకు చెప్పాలి. నిజమే, బడ్జెట్‌లో ఆదాయ వ్యయాలు, పెట్టుబడులు, మిగులు, లోటు లాంటి అనేక విషయాలను ప్రస్తావించాల్సి వుంటుంది. గత సంవత్సరం ఎంత కేటాయించారు, ఎంత ఖర్చు చేశారు, వచ్చే సంవత్సరంలో ఎంత కేటాయించనున్నారు అనే విషయాలు చెప్పాల్సి వుంటుంది. ముసాయిదా బడ్జెట్ పత్రాన్నిముందు పెట్టుకొని ఆ పని చేయటం అసాధ్యం. ఒకే విషయం గురించి అదే పత్రంలో రెండు రకాల గణాంకాలుంటాయి; తప్పుడు లెక్కలుంటాయి. మొత్తం ఖర్చు రెండు పేజీల్లో రెండు రకాల అంకెలుంటాయి. ప్రణాళిక కేటాయింపుల గురించి అంతా గందరగోళం. ఇలాంటి గజిబిజి గణాంకాలు ముందుంచుకొని విశ్లేషించడం ఎలా? కేటాయింపులు చేయటం ఒక ఎత్తు వాటిని ఖర్చుచేయడం మరొక ఎత్తు. ఈ సంవత్సరం అంటే కరువు పరిస్థితులేర్పడ్డాయి కాబట్టి పూర్తిగా ఖర్చు చేయలేక పోయిందని సరిపెట్టుకోవచ్చు. కాని ప్రతి సంవత్సరం కేటాయింపులకు, ఖర్చుకు పొంతన వుండదు. తొమ్మిదో ప్రణాళికలో ఈ ఒక్క సంవత్సరంలోనూ కేటాయించిన సొమ్మునంతా ఖర్చు చేయలేదు. ప్రణాళిక అమలుపరచి ఫలానా పనులు చేస్తాం. ఇంత సాధిస్తాం అని ఆ పుస్తకాల్లో వుండదు. మరుసటి సంవత్సరం ప్రణాళిక పుస్తకంలో ఈ పనులు చేశాం అని క్లుప్తంగా చెబుతారు. కాని ఎంత చేయాలని లక్ష్యం పెట్టుకొంటే ఇంత సాధించారో చెప్పరు. మన బడ్జెట్, మన ప్రణాళిక, ఆఖరుకు మన రోజువారీ ఖర్చులు అన్నీ విదేశీ రుణాల మీదే ఆధారపడ్డాయి. ఈ సంవత్సరం, గత సంవత్సరంలో ప్రపంచబ్యాంకు ఇస్తానన్న వ్యవస్థాగత సర్దుబాటు రుణం తీసుకుంటే తప్ప మన రోజువారీ ఖర్చును కూడా చేయలేని పరిస్థితి ఏర్పడింది. అందుకనే అన్ని విషయాలు మీ ముందుంచాం. ఏం చేయాలో సలహాలివ్వండి అని, అంటున్నారు. కొన్ని జిల్లాల్లో ముసాయిదా జనానికివ్వకుండానే సలహాలిమ్మన్నారు. ఆ అధికారులతో, ప్రజలతో సర్కస్ చేయిస్తుంది ప్రభుత్వం. ఈ సర్కస్ వినోదాన్ని ఇస్తుందో లేక సర్కస్‌లో జంతువులు జనం మీద పడి కాళ్లుచేతులు నమిలి మింగేస్తాయో వేచి చూడాలి.

**- సమతా పబ్లికేషన్స్**

## రెండు రెళ్ళ నాలుగు

### ఉత్పత్తి, సేవారంగాల్లో బడ్జెట్ కేటాయింపులు - 2003-04 (రూ॥ లక్షల్లో)

| క్రమ సం. | శాఖ | సంవత్సరం | ప్రణాళికేతర | ప్రణాళిక | మొత్తం |
|---|---|---|---|---|---|
| 1. | పరిశ్రమలు, | 2002-03 బ.అం. | 1 372 | 14 976 | 16 348 |
| | వాణిజ్యశాఖ | 2002-03 స.అం. | 1 338 | 13 987 | 15 325 |
| | | 2003-04 బ.అం. | 1 742 | 17 642 | 19 384 |
| 2. | కార్మికులు, | 2002-03 బ.అం. | 1 342 | 2 296 | 3 638 |
| | ఉద్యోగులు, | 2002-03 స.అం. | 1 346 | 2 080 | 3 426 |
| | శిక్షణ శాఖ | 2003-04 బ.అం. | 1 426 | 2 193 | 3 619 |
| 3. | టూరిజం శాఖ | 2002-03 బ.అం. | 257 | 3 841 | 4 138 |
| | | 2002-03 స.అం. | 1 377 | 2 808 | 4 185 |
| | | 2003-04 బ.అం. | 1 392 | 3 527 | 4 919 |
| 4. | పర్యావరణ | 2002-03 బ.అం. | 10 970 | 15 245 | 26 215 |
| | అడవులు, సైన్సు | 2002-03 స.అం. | 10 147 | 10 307 | 20 454 |
| | టెక్నాలజి శాఖలు | 2003-04 బ.అం. | 11 758 | 25 508 | 37 266 |
| 5. | సమాచారం, | 2002-03 బ.అం. | 65 | 5 418 | 5 483 |
| | టెక్నాలజీ, | 2002-03 స.అం. | 73 | 3 882 | 3 955 |
| | కమ్యూనికేషన్ శాఖ | 2003-04 బ.అం. | 79 | 7 700 | 7 779 |
| 6. | దేవాదాయ | 2002-03 బ.అం. | 1 717 | 0 | 1 717 |
| | శాఖ | 2002-03 స.అం. | 1 717 | 0 | 1 717 |
| | | 2003-04 బ.అం. | 1 616 | 0 | 1 616 |
| | మొత్తం | **2002-03 బ.అం.** | **15 723** | **41 776** | **57 539** |
| | | **2002-03 స.అం.** | **15 998** | **33 064** | **49 062** |
| | | **2003-04 బ.అం.** | **18 013** | **56 570** | **74 583** |

బ.అం = బడ్జెట్ అంచనా    స. అం. = సవరించిన అంచనా

### 2003-04 ప్రణాళికలకు నిధులు

ప్రణాళిక అమలుకు కావాల్సిన నిధులెక్కడెక్కడ నుంచి వస్తాయో మూసాయిదా బడ్జెట్ అంచనా ఇచ్చింది.

| | కోట్ల రూ॥లో |
|---|---|
| విదేశీ సహాయం | 2,532.19 |
| 11వ ఫైనాన్స్ కమీషన్ | 60.78 |
| పి.ఎం.జి.వై | 156.44 |
| మాచింగ్ షేర్ | 338.30 |
| ఆర్.ఐ.డి.ఎఫ్ | 783.68 |
| తుఫాను ఎమర్జెన్సీ | 0.50 |
| ఎ.ఐ.బి.పి. | 356.74 |
| రాష్ట్ర ప్రణాళిక | 5,295.36 |
| కొత్త పథకాలు | 626.58 |
| కేంద్ర ప్రతిపాదిత పథకాలు | 1,477.23 |
| **మొత్తం** | **11,877.80** |

## సమీక్షా సమీక్ష

ప్రజాపక్ష సమీక్ష ప్రతిని పంపించినందులకు కృతజ్ఞతలు. ఇలాంటి మంచి పత్రికను తీసుకుని రావడానికి చొరవ తీసుకున్నందుకు అభినందనలు. ఇలాంటి పత్రికను తీసుకురావాలనే తలంపు మీకు సరియైన సమయంలోనే కలిగిందని భావిస్తున్నాను. మీ పత్రికకు అండదండలు అవసరం. ఒక యజ్ఞంలా భావించి ముందుకు తీసుకొనిపోవాలి.

మీ ఆలోచనకు సహాయంగా ఈ ఉత్తరంతో పాటు రూ. 1000/- (చెక్ నెం. 227308) పంపిస్తున్నాను. వకుళాభరణంగారన్నట్లు ఇలాంటి పత్రిక కొనసాగేలా చూడాల్సిన బాధ్యత పాఠకులమీద వుంది.

ఎన్. భాస్కర్ రావు
సెంటర్ ఫర్ మీడియం స్టడీస్
న్యూ ఢిల్లీ.

# ముసాయిదా బడ్జెట్ : పెరుగుతున్న అప్పు, తరుగుతున్న అభివృద్ధి

- వి. హనుమంతరావు

ఆ మధ్య కేంద్రంలో మొదటిసారిగా మధ్యంతర ఆర్థిక సమీక్షను పార్లమెంటులో ప్రవేశపెట్టారు. బాజా భజంత్రీలు, సన్నాయి మేళాలు, విద్యుద్దీపాలు, ఊరేగింపులు ఏమీలేవు. కాని, రాష్ట్రంలో ముందస్తుగా ముసాయిదా బడ్జెట్ ప్రవేశపెట్టకముందు వారం పదిరోజులనుంచి చెవులు హోరెత్తే ప్రచారం ప్రారంభమైంది. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రికి ఇది షరా మామూలే. గోరంతలు కొండంతలుగా అని అంటారే, అదే ఇది.

ముందస్తుగా బడ్జెట్ స్వభావ స్వరూపాలను ప్రజలకు తెలియ చెప్పటం, వారి అభిప్రాయాలను తెలుసుకొని, ఆచరణీయమైన వాటిని స్వీకరించి, తదనుగుణంగా మార్పులు, చేర్పులు చేసి వార్షిక బడ్జెట్‌ను ప్రవేశపెట్టడం నిరాక్షేపణీయమైన విషయం. మంచిదే. కాని ఈ మంచితనం బడ్జెట్ ప్రవేశపెట్టే పద్ధతిలో కన్నా, బడ్జెట్‌లో వున్న ప్రతిపాదనల్లో కనపడినపుడే అది సామాన్య ప్రజల్లో స్పందన కలిగిస్తుంది. రాష్ట్రంలో ప్రజలు దారుణమైన పరిస్థితులనెదుర్కొంటున్నారు. మంచినీరు, పంటలు-ఈ రెండింటి గురించి గత కొద్ది నెలలుగా చర్చ అనంతంగా సాగుతుంది. అలాంటి పరిస్థితుల్లో బడ్జెట్ మిగులు బడ్జెటా, లోటు బడ్జెటా, ఆదాయం ఎంత, వ్యయం ఎంత అని మూడు, నాలుగు వారాలపాటు చర్చకు పెట్టడం చూస్తే సామాన్యుడి దృష్టిని అతని నిత్య సమస్యలనుంచి మళ్లించడమేనని అనుకోకుండా వుండలేం. పైనుంచి జిల్లాస్థాయి వరకూ ప్రభుత్వ యంత్రాంగం తిండి, కరువు, మంచినీటి కరువు పరిష్కారంకోసం కృషి చేయాల్సిన సమయంలో బడ్జెట్ చర్చల ఏర్పాట్లవైపు నిమగ్నమైపోతారు. పత్రికలనిండా ఈ చర్చలవార్తలే వుంటాయి. అసలు సమస్యలు వెనుక బెంచీల్లోకి పోతాయి. ఇలా పరిపాలనా యంత్రాంగాన్ని మళ్లించటం, రాష్ట్రం కరువు కాటకాలతో, ఆర్థిక ఇబ్బందులతో సతమతమౌతుంటే ముఖ్యమంత్రి ప్రపంచాన్నే తమ గుప్పెట్లో పెట్టుకొన్న బహుళజాతి సంస్థలతో భుజాలు రాసుకోవ డానికి వెళ్ళడం క్షంతవ్యం కాదు.

ప్రధానంగా వ్యవసాయాధారమైన రాష్ట్రం కాబట్టి వ్యవసాయాని కెంత కేటాయించబోతున్నారని చూడటం సహజం. నీటిపారుదల లేనిదే వ్యవసాయం లేదు కాబట్టి, వ్యవసాయం, నీటిపారుదల రంగాలకు చేసిన కేటాయింపులు కలిపి చూస్తే 'ఈనాడు' పత్రిక అన్నట్లు "నిధులి స్తున్నాట్లా, విదిలిస్తున్నట్లా" అని ప్రశ్నించాల్సి వస్తుంది. అందులోనూ గత రెండు, మూడు సంవత్సరాలుగా తరతమ స్థాయిలో కరువు మన రైతును వెంటాడుతూంది కాబట్టి, రైతుకు మరింత ఎక్కువగా సహాయం చేయాల్సిన నేపథ్యంలో కేవలం వ్యవసాయానికి మొత్తం కేటాయింపులో 2.52 శాతం (ఇపుడు 2.39 శాతం) మాత్రమే ఖర్చు చేయాలనుకొంటే, అది అవసరాలతో పోలిస్తే ఏ మూలకు వస్తుంది? అది కూడా కేవలం వ్యవసాయానికి మాత్రమే కాదు తత్సంబంధిత రంగాలకు కలిపి ఈ కేటాయింపు. ఒక పక్కనుంచి ప్రపంచబ్యాంకు, రెండోపక్కనుంచి డబ్ల్యు.టి.వో. మన వ్యవసాయాన్ని కబళించే ప్రయత్నాలు ముమ్మరం చేస్తున్నప్పుడు, రైతును రక్షించాల్సి వుండగా ముష్టి వాడికి చెయ్యి విదిలించినట్లు కేటాయింపు కాస్త పెంచేసి చేతులు దులపుకోవటాన్ని ఏమనాలి? నీటి పారుదల రంగానికి కేటాయింపులు భారీగానే చేసినా (ప్రతీ 10 రూపాయల కేటాయింపులో ఒక రూపాయి కేటాయింపు భారీ కేటాయింపా) అది ఎన్నికల వాసన వేస్తుంది. నడుస్తున్న సంవత్సరంతో పోలిస్తే కేటాయింపు కేవలం ఒక్క శాతం మాత్రమే పెరిగింది. గత అయిదారు సంవత్సరాల గణాంకాలు చూస్తే కాల్వల కింద, సాగుభూమి విస్తీర్ణం స్థంభించింది. చెరువుల కింద సేద్యం తగ్గింది. గొట్టపుబావుల కింద కాస్త పెరిగిందంటే అది రైతులు స్వంత పెట్టుబడితో సాధించుకొన్నదే గాని ప్రభుత్వ మెహర్బానీ ఏమీకాదు.

వచ్చే ఆర్థిక సంవత్సరంలో మన రాష్ట్రం మొత్తం ఆదాయం అంచనా రూ. 42,082 కోట్లు. మన రుణభారం రు. 57,150 కోట్లు. అంటే ఈ నూతన మిలీనియంలో (2000-01 నుంచి) ఆదాయం 10.86 శాతం పెరిగితే అప్పు 60.30 శాతం పెరిగింది. గుడ్ గవర్నెన్స్‌కు ఇదో ఉదాహరణా? అప్పు ఇలా పెరగటం ఆరోగ్యకరం కాదు కదా అంటే అప్పు చెయ్యనిదే అభివృద్ధి సాధ్యం కాదంటారు ముఖ్యమంత్రి. కాని వాస్తవమేమంటే అప్పు పెరుగుతోంది అభివృద్ధి గుంటపూలు పూస్తుంది.

2002-03 బడ్జెట్ ఇన్-బ్రీఫ్ ప్రకారం మొత్తం రెవెన్యూ ఖర్చులో అభివృద్ధి ఖర్చు 1997-98లో 66.53 శాతం నుంచి 2002-03 బడ్జెట్ అంచనా ప్రకారం 58.64 శాతానికి పడిపోయింది. ప్రభుత్వ గణాంకాలే ముఖ్యమంత్రి చెబుతున్నది వాస్తవ విరుద్ధమని ధృవీకరిస్తున్నాయి.

రాష్ట్ర ప్రభుత్వం మొత్తం ఆదాయం 1995-96 లో రు. 9,197 కోట్ల నుంచి వచ్చే ఆర్థిక సంవత్సరం 2003-04 లో రు. 27,965 కోట్లకు చేరనుంది. ఖర్చు అదే కాలంలో రు. 11,642 కోట్ల నుంచి రు. 30,373 కోట్లకు చేరనుంది. ఉదాహరణకు 2003-04లో ఈ మొత్తంలో కేంద్రం రుణాలు రు. 3,807 కోట్లు, అంతర్గత రుణం రు. 2,901 కోట్లు ప్రావిడెంట్ ఫండ్, చిన్నమొత్తాల పొదుపు మొత్తాలు రు. 2,641 కోట్లు గ్రాంట్లు రు. 4,523 కోట్లు వున్నాయి. అంటే రు. 30,373 కోట్ల

ఖర్చులో రుణాలు రు. 13,872 కోట్లు (45.67 శాతం) వున్నాయి. ఈ మొత్తంలో 3,000 కోట్లకు పైగా విదేశీ రుణాలున్నాయి. రాష్ట్రానికి పన్నులు, పన్నేతర ఆదాయం తప్ప మరో రకమైన ఆదాయం లేదు. పన్నుల్లో కూడా 78 శాతం అమ్మకం పన్నే వుంది. ఇది సామాన్యుని నుంచే వసూలవుతోంది. ఎక్కడైతే డబ్బుందో అక్కడ పన్నుభారం పెంచడం, వేసిన పన్నును పూర్తిగా వసూలు చేయటం, చట్టాల్లో లొసుగులను అరికట్టి లీకేజీ లేకుండా చేయటం, ఉత్పత్తికి తోడ్పడని ఖర్చులను తగ్గించటం, లంచగొండితనాన్ని నిర్మూలించటం పన్నేతర ఆదాయాన్ని పెంచటం, ప్రతీనిత్యం కాసులు గలగలలాడే వృత్తుల వారి వద్దనుంచి తగు స్థాయిలో వృత్తి పన్ను వసూలు చేయటం లాంటి అనేక విధాలుగా మన ఆదాయాన్ని పెంచుకోవచ్చు. ఎవరివద్ద లంకెల బిందెలున్నాయో, వారిని ముట్టుకోనంత కాలం సామాన్యుడిని బాదడమే ప్రభుత్వానికి మిగిలిన ఏకైక ఆదాయం. తాజా ముసాయిదా బడ్జెట్లో ప్రతీ ప్రభుత్వశాఖను బాదుడు (యూజర్ ఛార్జీలు) మొదలు పెట్టమని ప్రభుత్వం ఆదేశాన్ని జారీ చేసింది. ఏ శాఖకాశాఖ యూజర్ ఛార్జీలు వేస్తే (ఈ ఛార్జీలను ప్రస్తుతం రు. 45.64 కోట్ల నుంచి రు. 105 కోట్లకు పెంచాలని ముసాయిదా బడ్జెట్ ప్రతిపాదించింది) ఈ బరువునంతా మొయ్యలేక సామాన్యుడి నడ్డి విరగటం ఖాయం. రాష్ట్ర బడ్జెట్ పన్నులు వెయ్యని బడ్జెట్ అని పత్రికలు పతాక శీర్షికలు పెడుతుంటాయి. కాని యూజర్ ఛార్జీలంటే పన్ను కాక మరేమిటి? యూజర్ ఛార్జీలు అన్నంత మాత్రాన అది పన్ను కాకుండాపోదు.

ఈ వ్యాసం ప్రారంభంలోనే రుణభారం రు. 57 వేల కోట్లని చెప్పడం జరిగింది. కాని అది వాస్తవం కాదు, 77వేల కోట్లు. దీనికి వివరణ అవసరం. ముసాయిదా పత్రం ప్రకారం 2000-01లో రుణ భారం రు. 35,651 కోట్లు మాత్రమే కాగా కాగ్ నివేదిక ప్రకారం ఈ భారం రు. 40,602 కోట్లు. ఈ 5,000వేల కోట్ల తేడా 2003-04 అంచనా రు. 57వేల కోట్లకు కలిపితే రు. 62వేల కోట్లు అవుతుంది. ప్రభుత్వం ఇచ్చిన గ్యారంటీల మొత్తం రు. 15,709 కోట్లుంది. ప్రభుత్వమే నిధుల్లేక డింకీలు కొడుతుంటే, ఈ చిన్న ప్రభుత్వ, సెమీ-ప్రభుత్వ సంస్థలు చెల్లించలేక పోతుండడం వల్ల అది ప్రభుత్వం నెత్తిన చుట్టుకొంటుంది. కాబట్టి ఈ 15వేల కోట్లు కలిపితే రు. 77వేల కోట్లు అవుతుంది. ఇందులో కూడా మనం ఫస్ట్ ఏమో ముఖ్యమంత్రి చెప్పాలి. అంటే తలసరి అప్పు సుమారు రు. 10,131 లు. దీనికి తలసరి కేంద్ర ప్రభుత్వం రుణభారం కూడా కలిపితే, మీ గుండె ఆగిపోతుందేమో నని భయంగా వుంది.

అప్పులద్వారా లభిస్తుంది రు. 14,116 కోట్లు, అంటే రాష్ట్రం ఆదాయంలో మూడోవంతు మేరకు రుణం చేస్తున్నదని మనం పైన తెలుసుకొన్నాం. దీనర్థం ఇంత సొమ్ము బడ్జెట్‌లోకి ఆదాయంగా చేర బోతున్నదని కాదు కాక పోగా, తిరిగి చెల్లింపులు, వడ్డీలు పోను నికరంగా మన చేతికి వస్తున్న మొత్తం ఒకసారి మైనస్‌లో పడుతుంది. ఉదాహరణకు ఈ క్రింది పట్టిక చూడండి.

(కోట్ల రూ॥లలో)

| | రుణం మొత్తం | నికరంగా చేతికి వచ్చింది |
|---|---|---|
| 1996-97 | 11118 | 672 |
| 1997-98 | 14124 | 952 |
| 1998-99 | 20052 | 2347 |
| 1999-2000 | 23343 | 2232 |
| 2001-01 | 27292 | 3178 |

(కాగ్ నివేదిక 2001)

ఈ రుణంలో అంతర్గత రుణం, కేంద్రం రుణం, ఇతర రుణాలు కలిపి వున్నాయి. స్థూల రాష్ట్రాదాయంలో రుణశాతం 0.24 నుంచి 0.30కు పెరిగింది. కాగా ఈ రుణాలవల్ల రాష్ట్రానికి గాని, ప్రజలకు గాని ఒరిగేది ఏమీ లేదు.

ఈ రుణం మీద వడ్డీలు 1995-96లో 1529కోట్లు. వుంటే 2003-04 లో అయిదురెట్లు పెరిగి 7449 కోట్లకు చేరుకొంటుంది. కేవలం రాష్ట్ర ఆదాయంలో వడ్డీ చెల్లింపులే సగానికి సుమారుగా దగ్గరగా వుంటాయి.

నూతన మిలీనియంలో ప్రవేశిస్తున్నాం కదా, ఇంకా పాత ధోరణిలోనే నడవడమేమిటి అని అనుకొన్నారో ఏమో గాని రాష్ట్ర ద్రవ్య లోటును 1999-00 సంవత్సరంలో రు. 4,976 కోట్ల నుంచి, మరుసటి సంవత్సరంలో రు. 7,306 కోట్లకు జంప్ చేయించి, అప్పటినుంచి అదే స్థాయిలో కొనసాగిస్తున్నారు. అలాగే రెవెన్యూ లోటును 1999-00 లో రు. 1,233 కోట్ల నుంచి, 2000-01లో రు. 3,595 కోట్లకు పెద్ద గంతు వేయించి, సుమారుగా అదే స్థాయిలో కొనసాగిస్తున్నారు. రెవెన్యూ లోటు అంటే ఆదాయానికి, వ్యయానికి మధ్యనున్న తేడా 2003-04 లో రు. 2,408 కోట్లకు తగ్గుతుందని ముసాయిదా బడ్జెట్ చెబుతూంది. ఇటు ఆదాయం, అటు వ్యయం ఒకటే రేటులో పెరుగుతూ వస్తున్నాయని గణాంకాలు తెలియజేస్తున్నాయి. అలాంటపుడు రెవెన్యూ లోటు ఎలా తగ్గుతుంది?

రాష్ట్రంలో పన్నులనుంచి వచ్చే ఆదాయం 1995-96 లో రు. 4,120 కోట్లనుండి 2003-04లో రు. 18,169 కోట్లకు అంటే నాలుగు రెట్ల మేరకు పెరిగింది. ఈ పెరుగుదలలో గమనించాల్సిన విషయమే మంటే ప్రజలను మరింతగా తాగుడుకు ప్రోత్సహించి, ఎక్సయిజు సుంకాన్ని 1995-96లో కేవలం 78 కోట్లనుంచి 2003-04లో రు. 2,188 కోట్లకు పెంచడం. కేంద్రం నుంచి పన్నుల్లో వాటా గ్రాంట్లు కలిపి పైన ఉదహరించిన కాలంలో రు. 4,149 కోట్ల నుండి రు. 9,796 కోట్లకు పెరగనుంది. బియ్యం సబ్సిడీ తగ్గి సగానికి సగం ఆదాయం సమకూరింది. విద్యుచ్ఛక్తి సబ్సిడీ రు. 150 కోట్లు తగ్గించ నున్నారు. చెప్పొచ్చేదేమంటే రకరకాల వనరులనుండి అదనపు

ఆదాయం సమకూరుతూనే వుంది. ఇది వేలకోట్లలో వుంది. అయినా, ఎపుడూ నిధులకు కరువే. కొన్ని సందర్భాల్లో జీతాలు చెల్లించడానికి కూడా ఓవర్ డ్రాఫ్టుకు రిజర్వుబ్యాంకు వద్దకు పరుగులు తీయాల్సి వస్తుంది. ముఖ్యంగా ఈ సంవత్సరంలో 33 లక్షల టన్నుల బియ్యం ఉచితంగా కేంద్రం ఇచ్చింది. మరి ఈ డబ్బంతా ఏ గోతిలో, ఏ జేబులో పోస్తున్నారు?

మాది పారదర్శక ప్రభుత్వం అని ముఖ్యమంత్రి పదే పదే గుర్తు చేస్తుంటారు. బడ్జెట్ ప్రవేశపెట్టడానికి ముందు కేవలం ముసాయిదా బడ్జెట్ పత్రాన్నే కాక, వివిధ శాఖలు కూడా అలాంటి పత్రాలు విడుదల చేశాయి. పూర్వరంగం సమాచారం అంతా ఇందులో ఇచ్చి వుంటారు కాబట్టి, రేపు బడ్జెట్ ప్రవేశపెట్టినపుడు సభ్యులు ఆ శాఖల సమాచారాన్ని అధ్యయనం చేసి, వారి వారి నియోజక వర్గాల అనుభవాన్ని జోడించి, ఫలవంతమైన ఉపన్యాసాలు ఇవ్వడానికి తోడ్పడతాయని ఆశించాలి.❐

## ఆంధ్రప్రదేశ్ ముసాయిదా బడ్జెట్ 2003-04

| | వాస్తవం | బ.అం | వాస్తవం | బ.అం. | డిసెంబరు వరకు ఖర్చు | స.అం. | బ.అం |
|---|---|---|---|---|---|---|---|
| **ఆదాయం** | | | | | | | |
| రెవెన్యూ ఆదాయం | 19475.24 | 22406.02 | 21845.06 | 25674.79 | 15300.53 | 23868.48 | 27964.89 |
| రాష్ట్ర సొంత ఆదాయం | 13294.83 | 14565.18 | 14468.24 | 16995.75 | 10376.31 | 16014.58 | 18169.12 |
| **ఆదాయం : దీనిలో** | | | | | | | |
| పన్ను ఆదాయం | 10370.93 | 1172.91 | 11550.59 | 13459.67 | 8922.94 | 12721.20 | 14576.60 |
| పన్నేతర ఆదాయం | 2923.90 | 2822.27 | 2917.65 | 3536.08 | 1453.37 | 3293.38 | 3592.52 |
| కేంద్రం రెవెన్యూ | 6080.41 | 7840.84 | 7376.82 | 8679.04 | 4924.22 | 7853.90 | 9795.77 |
| పెట్టుబడులు | 18480.92 | 13417.61 | 21050.06 | 13745.21 | 5370.98 | 13761.97 | 14116.73 |
| మొత్తం ఆదాయం | 37956.16 | 35823.63 | 42895.12 | 39420.00 | 20671.51 | 37630.45 | 42081.62 |
| **ఖర్చు** | | | | | | | |
| రెవెన్యూ ఖర్చు | 23070.36 | 26293.05 | 24726.32 | 28156.62 | 15869.41 | 27188.83 | 30372.73 |
| ప్రణాళికేతర ఖర్చు | 18832.43 | 20541.52 | 19855.76 | 21688.74 | 12691.46 | 21360.79 | 23211.07 |
| ప్రణాళిక ఖర్చు | 4237.93 | 5751.53 | 4870.56 | 6467.88 | 3177.95 | 5828.04 | 7161.66 |
| పెట్టుబడి ఖర్చు | 2723.53 | 3815.43 | 3090.96 | 4291.83 | 1950.53 | 3538.20 | 4261.44 |
| ప్రణాళికేతర | 236.67 | 13.21 | 21.41 | 418.44 | 159.01 | 365.01 | 448.38 |
| ప్రణాళిక | 2382.97 | 3464.56 | 2830.66 | 3617.77 | 1734.30 | 2917.57 | 3522.43 |
| పెట్టుబడి చెల్లింపులు | 12164.75 | 5715.15 | 14930.23 | 6971.55 | 2851.57 | 6903.42 | 7447.45 |
| రుణాలు, అడ్వాన్సులు | 1389.09 | 1474.87 | 1697.54 | 1521.18 | 702.17 | 1371.34 | 1618.59 |
| ప్రణాళికేతర | 496.48 | 701.97 | 537.84 | 562.94 | 237.21 | 495.86 | 715.51 |
| ప్రణాళిక | 892.61 | 772.90 | 1159.70 | 958.24 | 464.96 | 875.48 | 903.08 |
| ప్రజారుణం తిరిగి చెల్లింపు | 10773.18 | 4240.28 | 13232.69 | 5450.37 | 2149.40 | 5532.08 | 5828.86 |
| మొత్తం ఖర్చు | **37956.15** | **35823.63** | **42747.45** | **39420.00** | **20671.51** | **37630.45** | **42081.62** |
| రెవెన్యూ (మిగులు, తరుగు) | **-3595.12** | **-3887.03** | **-2879.70** | **-2481.83** | **-568.88** | **-3320.35** | **-2407.84** |
| మొత్తం ద్రవ్యలోటు | **-7305.86** | **-8897.04** | **-6722.76** | **-7499.31** | **-3096.89** | **-7691.65** | **-7527.56** |

వాస్తవం : Actuals.    బ.అం. బడ్జెట్ అంచనా    స.అం. సవరించిన అంచనా

# అమెరికా 9/11 దాడులగురించి బుష్‌కు ముందే తెలుసా?

సెప్టెంబర్ 11వ తేది తీవ్రవాద దాడులకు చాల సంవత్సరాల పూర్వమే సన్నాహాలు జరిగాయని కొందరు పరిశీలకుల అభిప్రాయం. వారి దృష్టిలో ఈ దాడులు బుష్‌కు తెలిసే జరిగాయని వెల్లడవుతోంది. ఈ కుట్రపూరితమైన దాడిని నెరవేర్చుకునేందుకు అమెరికా సౌదీ అరేబియా, పాకిస్తాన్‌లను వాడుకుందని పలువురు పరిశీలకులు వాదిస్తున్నారు. దీనికై ఆల్‌ఖైదాకు ఆఫ్ఘనిస్తాన్‌లో నిధులను, అవసరమైన మౌలిక సదుపాయాలను అమెరికాయే కల్పించిందని వీరి ఉద్దేశం. ఈ కుట్రంతా ప్రపంచంపై అమెరికా పెత్తనాన్ని కొనసాగించేందుకు మరెవరు తనకు వ్యతిరేకంగా, గొప్ప శక్తిగా ఎదగకుండా చూసేందుకు, అమెరికా విధానాలు, ప్రయోజనాలకు అనుకూలంగా అంతర్జాతీయ భద్రతా వ్యవస్థను రూపొందించేందుకే ఈ దాడులు ఉద్దేశించినవని ప్రత్యామ్నాయ మీడియా ప్రదేశం. ఈ మేరకు బ్రిటన్‌కు చెందిన ది సండే హెరాల్డ్ పత్రికలో నెయిల్ మ్యాకే 2002వ సంవత్సరం సెప్టెంబర్‌కే 10వ తేదీన వ్యాఖ్యానించారు.

పలు ప్రముఖ పత్రికలు (ఉదాహరణకు ఫైనాన్షియల్ టైమ్స్, ఇండి పెండెంట్, పోర్చుగల్, ఫ్రంట్ పేజ ఆన్‌లైన్ ఈ మేరకు వ్యాఖ్యానించడం గమనార్హం.

సెప్టెంబర్ 11వ తేదీ ఉదయం పాకిస్తాన్ గూఢచారి విభాగపు అధిపతి జనరల్ మహమూద్ అహ్మద్, అంటే 9/11 హైజాకర్ల దాడులకు వెనుక ఉన్న డబ్బును సరఫరా చేసినవాడిగా నిందితుడైన వ్యక్తి "క్యాపిటల్ హిల్"లో సెనేటర్ బాబ్‌గ్రాహమ్ మరియు పోర్టర్ గ్రాస్ (ఈయన సెనేట్ చైర్మెన్, అలాగే హౌస్ ఇంటలిజెన్స్ కమిటీలకు నాయకుడు) లతో కలిసి అల్పాహార విందులో ఉన్నాడు. వారు తీవ్రవాద సమస్య గురించి మాట్లాడుకుంటున్నారు. కాబట్టి 9/11 దాడుల విషయంలో నిగూఢంగా మిగిలిపోయిన అంశాల గురించి చర్చిస్తూ మైఖేల్ చోస్‌దోవుస్కీ ఒక పుస్తకాన్నే రాయడం ఏమంత ఆశ్చర్యకరం కాదు. బుష్‌కు దాడుల విషయం ముందే తెలుసని ప్రకటించడం ద్వారా ది న్యూయార్క్ పోస్ట్ పత్రిక సంచలనాన్ని సృష్టించింది. తర్వాత దీని నంతటిని రాజకీయంగా సొమ్ము చేసుకునేందుకు అమెరికా డెమోక్రటిక్ పార్టీ వాళ్ళు రహస్య పత్రాలను వెల్లడించవలసిందిగా అధ్యక్షుడు బుష్‌పై వత్తిడి తేసాగారు. ఈ మొత్తం నేపథ్యంలో 9/11 దాడులు ఇంకా ప్రపంచం ముందు మిస్టరీ వీడని అంశంగానే మిగిలిపోయాయి.

ఈ విషయంలో చరిత్ర, కాలగమనం మాత్రమే వాస్తవాలను వెల్లడించగలవు.

**ఐక్యరాజ్యసమితి మానవ హక్కుల సంఘం చైర్మెన్ పదవి లో లిబియా :**

జనవరి మాసంలో జరిగిన ఐక్యరాజ్యసమితి మానవ హక్కుల సంఘపు రహస్య బ్యాలెట్ పత్రాల ఎన్నికలో లిబియా సంఘానికి అధ్యక్షురాలిగా ఎన్నికయింది. గతంలో ఎన్నడూ లేని విధంగా ఈ రహస్య బ్యాలెట్‌కై అమెరికా కోరింది. తద్వారా సంఘంలో తన కష్టాలను తానే తీవ్రతరం చేసుకుంది. ఈ ఎన్నికల్లో పోలైన మొత్తం ఓట్లలో లిబియాకు అనుకూలంగా 33 ఓట్లు వచ్చాయి. వ్యతిరేకంగా 3 ఓట్లు పడ్డాయి. 17 దేశాలు ఓటింగ్ చేయకుండా తప్పుకున్నాయి. అంటే ఈ ఎన్నికల్లో లిబియా ఘనవిజయం సాధించింది.

కాగా ఈ పరిస్థితి అమెరికాకి మింగుడు పడటం లేదు. దీనికి నిదర్శనమే లిబియా ఎన్నిక గురించి అమెరికా స్టేట్ డిపార్ట్‌మెంట్ అధికార ప్రతినిధి రిచర్డ్ బౌచర్ లిబియా ఎన్నిక అమెరికాకు "నిరాశను" కలిగించిందని చెప్పటం. ఇప్పటివరకు అమెరికా లిబియాను కూడా మానవ హక్కులను ఉల్లంఘిస్తున్న దేశంగా ప్రచారం చేస్తూ వచ్చింది. కాబట్టి లిబియా మానవ హక్కుల సంఘానికి నాయకత్వం వహించడం అమెరికాకు చెంపపెట్టు. ఈ క్రమంలో అమెరికా లిబియాకు ఓటు వేసిన దేశాలను నిందించే వరకూ పోయింది. అవి బాధ్యతా రహితంగా వ్యవహరించాయని పరోక్షంగా పేర్కొంది. అలాగే లిబియాకాని, భవిష్యత్తులో మరే అభ్యర్థి దేశం గాని ప్రపంచపు ఆమోదాన్ని పొందగలదని తాము భావించడం లేదని బౌచర్ చెప్పారు. ఇక్కడ ప్రపంచపు ఆమోదం అంటే అమెరికా ఆమోదముద్ర అని వేరే చెప్పనవ సరం లేదు. ప్రజాస్వామ్యం పట్ల అమెరికాకు ఎంత గౌరవం ఉందో మానవ హక్కుల సంఘంలో పరాభవం తర్వాత అమెరికా తీరు వెల్లడిస్తుంది. ఇక ఎన్నికల్లో పాల్గొనకుండా తప్పుకున్న 17 దేశాల గురించి కూడా అమెరికా ప్రతికూల వ్యాఖ్యను మానుకోలేదు. ఆ దేశాలు వాస్తవ పరిస్థితిని అర్థం చేసుకోవడం లేదని, సన్నిహితంగా పరిశీలించ టం లేదని విమర్శించింది. ఈ మొత్తం పరిణామం ప్రపంచంలో దిగజారి పోతున్న అమెరికా ప్రతిష్ఠకు నిదర్శనం.

లిబియా తన ఎన్నిక గురించి వ్యాఖ్యానిస్తూ తాను మానవ హక్కులను ఉల్లంఘిస్తున్నాననడం పచ్చి అబద్ధం అని లిబియా చెప్పింది. మానవ హక్కుల పట్ల గౌరవం పొందుపర్చబడిన దేశం లిబియా. మా దేశంలోని భద్రతా, రాజకీయ స్థిరత్వం, ఆర్థిక సుభిక్షతా ఇక్కడి మానవ హక్కులకు తార్కాణం అని ఒక ప్రకటనలో లిబియా విదేశాంగ మంత్రిత్వశాఖ పేర్కొన్నది. (మిగతా 21వ పేజీలో)

# చింతల చెంత చిన్న పరిశ్రమలు

- బి. ఎర్రం రాజు*

ఎక్కడ వేశావురా గొంగళి అంటే వేసినచోటే వున్నట్లున్నాయి చిన్న పరిశ్రమలు. గత పది సంవత్సరాలలో ఆర్థిక సంస్కరణలు చిన్న పరిశ్రమలను అతలాకుతలం చేస్తున్నాయి. పరపతి సౌకర్యాలు నానాటికి తీసికట్టు నాగంబొట్లు అన్నట్టున్నాయని ఇటీవల ప్రణాళిక సంఘమే నిర్ధారించింది. ఎన్నో అధ్యయన సంఘాలు నివేదికలు సమర్పించాయి. 'ఇన్స్పెక్టర్ రాజ్' విశృంఖలత పది సంవత్సరాల సరళీకృత విధానాల అమలు తరువాత కూడా చెలరేగుతూనే ఉన్నది. ఈ వ్యాసానికి అనుబంధంగా ఇచ్చిన పట్టికయే దీనికి నిదర్శనం.

ప్రధాని ఇటీవల జాతీయ అభివృద్ధి మండలిని, భారత వాణిజ్య పరిశ్రమల ఫెడరేషన్ వార్షిక సమావేశాన్ని వుద్దేశించి చేసిన ప్రసంగాలలో ఈ 'ఇన్స్పెక్టర్ రాజ్' గురించి వాపోయారు. మనం చేయవలసింది, చేయగలిగింది చేయకపోగా, చెప్పేసి చేతులు దులుపుకోవడం పాలకుల కు పరిపాటి అయిపోయింది.

వెనుకటికి నేనొక జపాన్ యూనివర్సిటీ ఆర్థిక శాఖ ప్రొఫెసర్‌తో ముచ్చటిస్తూ వేసిన ప్రశ్నకు వచ్చిన సమాధానం గమనార్హం. "మీరు చిన్న మధ్య తరహా పరిశ్రమలకు, వ్యాపార సంస్థలకు, ప్రత్యేక శాసనం ద్వారా విపరీతమైన రక్షణ కల్పించారు. ఇది WTO నేపథ్యంలో ఎంతవరకు సమంజసం?"

ఆయన సమాధానం : "మా చిన్న, మధ్య తరహా పరిశ్రమలు స్థానికంగానూ, భౌగోళికంగాను, పోటీ వ్యవస్థలో నిలబడి, వుత్పత్తులు ఉద్యోగావకాశాలు ముమ్మరంగా అంతర్జాతీయ ప్రమాణాలకు కట్టుబడి నిలబడాలంటే, మేము వాటికి పటిష్టమైన రక్షణ కలిగించాలి. మా చిన్న పరిశ్రమలు కుంటుపడితే, మా మనుగడకే ముప్పు. ఈ తరహా పరిశ్రమలకి భౌగోళీకరణ ద్వారా ఏర్పడే కష్టనష్టాలను తట్టుకునే శక్తి వుండదు."

కాని సరళీకృత విధానాలు అమలు పరుస్తున్న దశాబ్దం గమనిస్తే మనదేశంలో వినవచ్చే సందేశం : "పోటీకి తట్టుకోలేని పరిశ్రమలు మూసుకుపోతాయి. కొన్ని పెద్దవాటిలో విలీనం అవుతాయి. తాటిచెట్టు ఎక్కేవాడిని ఎంతవరకు తోస్తామండి? ఈ చిన్న పరిశ్రమలకి ఎవరి మీదోపడి ఏడవడం ఆనవాయితీ.నైదు దశాబ్దాల 'సబ్సిడీ' రక్షడీ' రక్షణ విధానాలకు స్వస్తి చెప్పాల్సిందే." స్వస్తి చెప్పాల్సిందే." అయితే ప్రభుత్వాధికారులు, ప్రజా ప్రతినిధులు ఈ విధమైన వాదన వెనుక గుత్తాధిపత్యం వహించే ప్రపంచ బ్యాంకు, దాని అనుబంధ సంస్థలు, వారు పరోక్షంగా ఇచ్చే ముడుపులూ, విదేశీయాన సౌకర్యాలు వున్నాయన్నదిగమనించాలి. అక్కడక్కడ బహిరంగంగా మొసలి కన్నీరొలికించే వారూ లేక పోలేదు. కనీసం పద్దెనిమిది దేశాలు చిన్న, మధ్య తరహా పరిశ్రమ వ్యాపారాలకు రక్షణ, ఆర్థిక మద్దతు కలిగిస్తూ ప్రత్యేక శాసనాలు రూపొందించారు. (వాటిలో అమెరికా కూడా వుందన్నది మరిచి పోకూడదు). మన దేశంలో చిన్న పరిశ్రమలకి బోలెడు రక్షణ కల్పించామండోయ్ అని ఘోషపెట్టే మంత్రిత్వశాఖలు, అధికారులు, అటువంటి సమగ్ర శాసనాన్ని రూపొందించినప్పటికీ పార్లమెంటులో ప్రవేశపెట్టడానికి ఎందుకు ఆలస్యం చేస్తున్నారో తెలియదు.

**ఈ శాసనం లక్ష్యం :**

(అ) చిన్న తరహా పరిశ్రమలని పోటీకి నిలదొక్కుకునేట్లుగా రక్షించడం.

(ఆ) వివిధ శాసనాలు, నియమ నిబంధనలు, తత్సంబంధిత ఇన్స్పెక్టర్లనుంచి విముక్తి కలిగించడం.

(ఇ) అర్థం లేని అనేక రాత ప్రతులు నుంచి విముక్తి కలిగించడం.

(ఈ) పోటీని తట్టుకునే విధంగా వ్యాపార విధానాలలోనూ 'టెండర్ల' సరళిలోనూ మార్పులు తీసుకురావడం.

(ఉ) అభివృద్ధి చెందిన దేశాలలోలాగ ఈ చిన్నతరహా వుత్పత్తులలో కొంతమేరకు (అమెరికాలో 30 శాతం వుంది) మనదేశంలో కూడా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నాణ్యతా ప్రమాణాలు సడలించకుండా, కొనుగోలు చేయడం;

(ఊ) అర్థరహితమైన ఆంక్షలకు, పూచికత్తులకూ అతీతంగా పరపతి సౌకర్యాలు సరియైన మేరకు సకాలంలో అందించే బాధ్యత వహించేటట్లు చేయడం.

ఎంత చక్రవ్యూహంలో చిక్కుకున్నా ఈ చిన్నపరిశ్రమలే గరిష్ట ఉత్పత్తిలో 11 శాతం అభివృద్ధి శాతం సాధించాయి. వ్యవసాయం తరువాత చిన్నతరహా పరిశ్రమలలోనే 170 లక్షల జనాభాకి ఉపాధి కల్పించాయి. పారిశ్రామిక ఎగుమతులలో కూడా వీరిదే పెద్దపీట కావడం విశేషం. 35-40 శాతం ఎగుమతులు చిన్న పరిశ్రమలవే. ప్రభుత్వ రంగ బ్యాంకుల్లో పేరుకున్న నికర నిరర్థక ఆస్తులు ఈ చిన్నపరిశ్రమలనుంచి కేవలం ఆరుశాతం. ఇటువంటి రంగాన్ని ప్రోత్సహించడానికి ప్రభుత్వం, పాలకులు ఎప్పుడు నడుం కడతారు?

## అనుబంధ పట్టిక

సరళీకృత విధానాలను అమలు పరిచిన దశాబ్దం తరువాత కూడా 'ఇన్‌స్పెక్టర్ రాజ్' విశృంఖలత తగ్గలేదనడానికి ఈ క్రింద పట్టిక ఒక ఉదాహరణ :

| | మంత్రిత్వశాఖ | ఇన్‌స్పెక్టర్ల సంఖ్య | పర్యవేక్షిస్తున్న విశేషాలు |
|---|---|---|---|
| 1. | పారిశ్రామిక శాఖ | 5 | రిజిస్ట్రేషను, ముడిసరుకులపై సుంకం/పన్ను చెల్లింపు, నాణ్యత ప్రమాణాలు, సంరక్షక పనిముట్లు. |
| 2. | హోంశాఖ | 2 | అగ్నిమాపక సామగ్రి, ప్రేలుడు పదార్థాల చట్టం |
| 3. | యోజన, గణాంక శాఖ | 1 | గణాంక వివరాల సేకరణ |
| 4. | ఆర్థిక శాఖ | 12 | ఆర్థికశాఖ (ఇన్‌కంటాక్స్) విభాగంలో ముగ్గురు ఇన్స్పెక్టర్లు ఒకే విధమైన రికార్డులు చూస్తూ వుంటారు. మరో 7 మంది సెంట్రల్ ఎక్సైజు, కస్టమ్స్ అధికారులు అడిగినదానినే అడుగుతూ చూసిన కాగితాన్నే దఫదఫాలుగా చూస్తారు. |
| 5. | రాష్ట్ర రెవిన్యూశాఖ | 6 | అమ్మకం పన్ను, తూనికలు, కొలతలు, వృత్తిపన్ను. |
| 6. | కార్మిక శాఖ | 8 | ఎనిమిది రకాల కార్మిక, అనుబంధ శాసనాలకు సంబంధించి ఒకే రకమైన ప్రతులు దఫదఫాలుగా చూస్తూ వుంటారు. |
| 7. | మునిసిపల్ కార్పోరేషన్ / మునిసిపాలిటీ | 2 | మునిసిపల్ శాసనం అమలు |
| 8. | విద్యుత్, ఇంధనం | 1 | విద్యుత్ కనెక్షన్లు |
| 9. | ఆరోగ్యం, కుటుంబ సంక్షేమ శాఖ | 2 | కార్మికుల ఆరోగ్యం, సంక్షేమ వ్యవహారాలు |
| 10. | పట్టణ వ్యవహారాలు, ఉద్యోగాలు | 1 | పరిసరాల శుభ్రత |
| 11. | పర్యావరణ, అటవీశాఖ | 2 | పర్యావరణ సంరక్షణ అమలు |
| 12. | స్థానిక స్వపరిపాలన శాఖ (పంచాయితీలు, మునిసిపాలిటీలు) | 2 | ఆక్ట్రాయి, సామూహిక దాడులు |
| 13. | కమ్యూనికేషన్లు శాఖ | 1 | టెలిఫోను, తత్సంబంధిత వ్యవహారాలు |
| 14. | ఆహారము, ఔషధాల శాఖ | 1 | ఆహార సంరక్షణ నిబంధనలు |

వెరసి నలబై ఆరుమంది ఇన్‌స్పెక్టర్లు ఏడాదిలో వారి ఇష్టానుసారంగా వచ్చి వేధిస్తూ వుంటారు. వీరందరి బెడద తప్పించుకోవాలంటే విడివిడిగాను, ఉమ్మడిగాను 'మామూళ్ళు' వుంటాయి. ఈ మామూళ్ళు ఇచ్చుకోలేకపోతే వేధింపు తప్పదు. ఈ మామూళ్ళ ఖర్చు, ఉత్పత్తిలో ఏడునుంచి 10 శాతం వరకూ వుంటుందని చిన్న పారిశ్రామికుల ఉవాచ. వీరి బెడద పెద్ద పరిశ్రమలకు లేక కాదు. కాని పెద్ద పరిశ్రమలో ఇన్స్పెక్టర్లు ప్రవేశించాలంటే గేటు దగ్గరే గూర్ఖా అటకాయిస్తాడు. ప్రవేశించాక వీళ్ళ వ్యవహారాలు చూసుకోడానికి ప్రత్యేక అధికారులుంటారు. కాని చిన్న పరిశ్రమలో అన్నియు తానై వర్తిస్తుంటాడు. ఔత్సాహిక పారిశ్రామికుడు ఆంధ్రప్రదేశ్ చిన్న పరిశ్రమల ఫెడరేషన్‌కు ముఖ్య సలహాదారునిగా వుంటూ శాండిల్య కన్సల్టెంట్సు (ప్రై)లిమిటెడ్ కు సంస్థాపక నిర్దేశకులుగా వున్నారు. పోయింది పొల్లు వున్నది గట్టిఅన్నట్లు వ్యవహరిస్తుంటాడు. ❒

---

*ఆంధ్రప్రదేశ్ చిన్న పరిశ్రమల ఫెడరేషన్‌కు ముఖ్య సలహాదారునిగా వుంటూ శాండిల్య కన్సల్టెంట్సు (ప్రై) లిమిటెడ్‌కు సంస్థాపక నిర్దేశకులుగా వున్నారు.

# బీహార్ కన్నా వెనుకబడిన ఆంధ్రప్రదేశ్

- అపర్ణ

రాష్ట్రాలు ప్రగతిపథంలో పయనించాలంటే ఆదాయ వనరులు బాగుండాలి. అంటే రాష్ట్రాల ఆదాయ అంచనాలను బట్టి వాటి ఆర్థికస్తోమత మనకు తెలుస్తుంది. స్థూల రాష్ట్ర ఉత్పత్తి ముఖ్యంగా మూడురంగాలనుంచి లభిస్తుంది. అవి ప్రాథమికరంగం, ద్వితీయ రంగం మరియు సర్వీసుల రంగం.

మన రాష్ట్రంలో స్థూలరాష్ట్ర ఆదాయం ప్రస్తుతధరల్లో 1993-94 సం॥లో రు 57867కోట్లు వుండగా అది క్రమేణా 2000-2001సం॥లో రు 1,37,602కోట్లకు పెరిగింది. అనగా 11.60శాతం కాంపౌండ్ అభివృద్ధిరేటు నమోదయింది. కాని ఈ అభివృద్ధి రేటు మనరాష్ట్రం కన్నా బీహారు రాష్ట్రంలో అత్యధికంగా అనగా 15.66శాతం నమోదయింది. కేరళలో 14.27శాతం, పశ్చిమ బెంగాల్‌లో 13.75శాతం, కర్ణాటకలో 13.51శాతం, హర్యానాలో 12.61శాతం, పంజాబ్‌లో 12.15శాతం, తమిళనాడులో 11.90శాతంగా నమోదయింది. భారతదేశం మొత్తం మీద స్థూల జాతీయ ఆదాయం అభివృద్ధిరేటు ఇదేకాలంలో 12.02శాతంగా వుంది. అనగా అక్షర క్రమంలో అగ్రగామిగా వున్న మన రాష్ట్రం ప్రధానరాష్ట్రాలతో పోలిస్తే 8వ స్థానంలో వుండటమేకాకుండా జాతీయ అభివృద్ధి రేటుకన్నా కూడ తక్కువగా వుంది. వెనుకబడిన రాష్ట్రంగా పేరొందిన బీహార్ అభివృద్ధిరేటులో ప్రథమస్థానంలో వుండటం ఆశ్చర్య కరమైనవిషయం.

ప్రాథమిక రంగంలో వ్యవసాయం దాని అనుబంధ సర్వీసులు, అడవులు, మత్స్యపరిశ్రమ, గనులు, త్రవ్వకం కలసి ఉంటాయి. వ్యవసాయమే జీవనాధారంగా వుండే మన రాష్ట్రంలో స్థూలరాష్ట్ర ఉత్పత్తి ఈ వ్యవసాయరంగం నుంచి ప్రస్తుత ధరల ప్రకారం 1993-94లో రూ.17422కోట్లు వుండగా 1996-97సం॥లో రూ.26663కోట్లకు పెరిగి తదుపరి సం.1997-98లో రుతుపవనాలు బాగుండక రూ.24,078 కోట్లకు తగ్గింది. 1998 - 99 నుండి 2000-01 వరకు ఈ రంగంలో స్థూల రాష్ట్రఆదాయం క్రమేణా పెరిగి (1999-2000సం॥ మినహా) 2000-01 సం.లో రూ.35,392 కోట్లుకు చేరింది. అనగా 1993-94 నుండి 2000-01 వరకు ఈ రంగంలో సగటు అభివృద్ధి రేటు 2.58 శాతంగా నమోదయి దేశంలోని ప్రధాన రాష్ట్రాలతో పోలిస్తే అయిదవ స్థానంలో వుంది. బీహార్ 13.61 శాతంతో ప్రథమ స్థానంలో వుంది. కర్ణాటక రెండవ స్థానంలో (10.07శాతం)పశ్చిమ బెంగాల్ మూడవ స్థానంలో (2.87శాతం), పంజాబు నాలుగవస్థానంలో (9.84శాతం) వుంది. కాగా ఇదే కాలంలో భారతదేశం మొత్తం మీద సగటు అభివృద్ధి రేటు 2.35శాతం. అనగా దేశం అభివృద్ధిరేటుతో పోలిస్తే మనరాష్ట్రం కొంత మెరుగ్గా అనగా గుడ్డిలో మెల్ల చందాన వుంది.

కాగా స్థూల రాష్ట్రఆదాయంలో వ్యవసాయ, పశుసంపద రంగం వాటా మనరాష్ట్రంలో 1993-94 నుండి 2000-01 వరకు సగటున 26.83శాతంతో పదవస్థానంలో వుంది. జామాతా దశమగ్రహ అన్నట్లు. పంజాబ్ ఇదే కాలంలో 40.65 శాతంతో ప్రథమస్థానంలో వుంది. బీహార్ 38.87శాతం వాటాతో రెండవస్థానంలో, అస్సాం 34.40శాతం వాటాతో మూడవస్థానంలో, హర్యానా 33.96శాతంలో నాలుగవస్థానంలో వుంది.

మొత్తం ప్రాథమికరంగంలో స్థూల రాష్ట్రఆదాయం మనరాష్ట్రంలో ప్రస్తుత ధరల ప్రకారం 1993-94 సం.లో రూ.20675కోట్లు వుండగా 2000-01సం.॥ నాటికి రూ.44182 కోట్లకుపెరిగి 10.36శాతం సగటు అభివృద్ధిరేటు నమోదయింది. ప్రధాన రాష్ట్రాలతో పోలిస్తే బీహార్ 13.24శాతం సగటు అభివృద్ధిరేటుతో ప్రథమస్థానంలో వుండగా ఆంధ్రప్రదేశ్ రెండవస్థానంలోవుంది. కాగా స్థూలరాష్ట్ర ఆదాయంలో ప్రాథమిక రంగంవాటా ఒరిస్సాలో సగటున 43.52శాతం వుండగా అస్సాంలో 43.58శాతం, బీహారులో 41.70శాతం, పంజాబులో 41.21శాతం, మధ్యప్రదేశ్‌లో 37.32శాతం వుండగా మన రాష్ట్రంలో 32.21శాతం వుంది. మనరాష్ట్రం ఈ దిశలో గూడ 10వ స్థానంలో వుంది.

ఇక ద్వితీయరంగంలోని తయారీరంగంలో స్థూల రాష్ట్ర ఆదాయం మనరాష్ట్రంలో 1993-94సం.లో రూ.5,684 కోట్లు వుండగా క్రమేణా 2000-01 సం.లో త్వరిత అంచనాల ప్రకారం రూ.12,455 కోట్లకు పెరిగి సగటున 9.23 శాతం అభివృద్ధిరేటు నమోదయింది. ప్రధాన రాష్ట్రాలతో పోలిస్తే 10వస్థానంలో వుంది. ఇక్కడ కూడ ఇదే కాలంలో బీహార్ 83.33శాతంతో సగటు అభివృద్ధి రేటులో ప్రథమ స్థానంలో వుంది. అస్సాం 19.15శాతంతో రెండవస్థానంలో, హర్యానా 12.37శాతంతో మూడవస్థానంలో, కర్ణాటక 12.04శాతంతో నాలుగవ స్థానంలో వుంది కాగా ఈ తయారీ రంగంలో దేశం మొత్తం మీద సగటు అభివృద్ధిరేటు 8.83శాతం.

1993-94 నుండి 2000-2001వరకు సగటున ఈ రంగం వాటా మొత్తం ఆదాయంలో మనరాష్ట్రంలో 9.54శాతం వుండగా, గుజరాత్‌లో 22.85శాతం, మహారాష్ట్రలో 17.15శాతం, హర్యానాలో 15.62శాతం, తమిళనాడులో 14.42శాతం, కర్ణాటకలో 11.46శాతం వుంది. కాగా దేశం మొత్తం మీద ఈ రంగం వాటా స్థూల జాతీయ ఆదాయంలో

ఇదేకాలంలో 10.56శాతంగా వుంది. అనగా దేశంతో పోల్చినా మనం వెనుకబడే వున్నాం.

రిజిష్టర్డ్ చెయ్యని తయారీరంగంలో మనరాష్ట్ర స్థూల ఆదాయం 1993-94లో రూ.2688కోట్లు వుండగా 2000-01సం.లో రూ.6404కోట్ల కు పెరిగింది. అంటే సగటు అభివృద్ధిరేటు ఈ రంగంలో 9.47శాతంగా వుండి ప్రధాన రాష్ట్రాలతో పోలిస్తే 11వస్థానంలో వుంది. పశ్చిమబెంగాల్ 13.41శాతం సగటు అభివృద్ధిరేటుతో ప్రథమస్థానంలో, మహారాష్ట్ర 12.85శాతంతో 2వ స్థానంలో, అస్సాం 12.44శాతంతో 3వస్థానంలో, మధ్యప్రదేశ్ 11.80శాతంతో 4వస్థానంలో, గుజరాత్ 11.34శాతంతో 5వస్థానంలో వున్నాయి. ఈ రంగంలో దేశం మొత్తం మీద అభివృద్ధి రేటు 9.92 శాతంగా నమోదయింది. దేశంతో పోల్చినా మనం వెనుకబడే వున్నాం.

మొత్తంమీద ద్వితీయరంగంలో ఆంధ్రప్రదేశ్ స్థూల రాష్ట్ర ఆదాయం ప్రస్తుత ధరల్లో 1993-94లో రూ.12684కోట్లు వుండగా 2000-01సం.లో త్వరితఅంచనాల ప్రకారం రూ.31158కోట్లు పెరిగి సగటు అభివృద్ధిరేటు 11.35శాతంగా నమోదయింది. ప్రధాన రాష్ట్రాలతో పోలిస్తే మనరాష్ట్రం 7వ స్థానంలో వుంది. బీహారు 24.10శాతంతో అభివృద్ధిరేటుతో మొదటిస్థానంలో వుంది. అస్సాం 15.24 శాతంతో రెండవస్థానంలో, కేరళ 13.72శాతంతో మూడవస్థానంలో, పశ్చిమ బెంగాల్ 12.78శాతంలో నాలుగవస్థానంలో, కర్ణాటక 12.62 శాతంతో ఐదవస్థానంలో వుంది.

కాగా స్థూల రాష్ట్ర ఆదాయంలో ద్వితీయరంగం వాటా గుజరాత్‌లో సగటున (1993-94 నుండి 2000-01వరకు) 38.66 శాతం వుండగా మహారాష్ట్రలో 32.55శాతం, తమిళనాడులో 31.32శాతం, హర్యానాలో 30.01శాతం, మన రాష్ట్రంలో 22.78శాతం వుంది. మన రాష్ట్రం ఈ దిశలో 10వస్థానంలో వుంది.

ఇక సేవల రంగంలో ఆంధ్రప్రదేశ్ స్థూల రాష్ట్ర ఆదాయం ప్రస్తుత ధరల్లో 1993-94లో రూ.24,508 కోట్లు వుండగా 2000-01 సం.లో రూ.62262కోట్లకు పెరిగి సగటు అభివృద్ధిరేటు 13.02శాతంగా నమోదయింది. ప్రధాన రాష్ట్రాలతో పోలిస్తే మనరాష్ట్రం 10వస్థానంలో వుంది. ఆశ్చర్యకరమైన విశేషం ఏమంటే కేరళలో సగటు అభివృద్ధిరేటు 18.61 శాతం వుండి మొదటిస్థానంలో వుంది. తమిళనాడు 17.85 శాతంతో మూడవస్థానంలో, కర్ణాటక 16.27శాతంతో నాలుగవస్థానంలో వున్నాయి.

కాగా స్థూల రాష్ట్రఆదాయంలో సర్వీసు రంగం వాటా కేరళలో సగటున (1993-94 నుండి 2000-01 వరకు) 52.86శాతం వుండగా మహారాష్ట్రలో 50.22శాతం, తమిళనాడులో 49.81శాతం, పశ్చిమ బెంగాల్‌లో 45.92శాతం, బీహార్‌లో 45.85శాతం వుండగా ఆంధ్ర ప్రదేశ్‌లో 44.32శాతం వుంది.

## నడుస్తున్న సంవత్సరంలో

2002-03 ప్రథమ అర్థభాగంలో (ఏప్రిల్-సెప్టెంబర్) స్థూలరాష్ట్ర ఆదాయం రూ.38981 కోట్లు వుంది. క్రితం సంవత్సర కాలంతో పోలిస్తే 5.37శాతం పెరిగింది. కాగా ఇదే కాలంలో దేశంలో స్థూలజాతీయ ఆదాయం అభివృద్ధి 5.80శాతం వుంది. అంటే దేశంతో పోలిస్తే మనం వెనుకబడే వున్నాం. కాగా వ్యవసాయ రంగంలో 2002-03సం. ప్రథమ అర్థభాగంలో స్థూలరాష్ట్రఆదాయం రూ.784.36కోట్లు క్రితం సం.ఇదే కాలంతో పోలిస్తే -17.06శాతం తగ్గింది. కాగా దేశం మొత్తం మీద 2.80శాతం అభివృద్ధి రేటు నమోదయింది.

2002-03 సం. ప్రథమఅర్థభాగంలో ద్వితీయరంగంలో రాష్ట్రం మొత్తంమీద 4.22 శాతం అభివృద్ధిరేటు నమోదుకాగా దేశం మొత్తం మీద 5.30శాతం అభివృద్ధిరేటు సాధించడం జరిగింది. అనగా ద్వితీయ రంగంలో కూడ దేశంతో పోలిస్తే మనం వెనుకబడే వున్నాం.

సర్వీసుల రంగంలో 2002-03సం. ప్రథమ అర్థభాగంలో మన రాష్ట్రంలో క్రితం సం. ఇదే కాలంతో పోలిస్తే అభివృద్ధిరేటు 6.08శాతం వుండగా దేశం మొత్తం మీద ఇదే కాలంలో అభివృద్ధి రేటు 7.30శాతం అనగా సర్వీసు రంగంలో కూడ దేశం అభివృద్ధి రేటుతో పోలిస్తే ఆంధ్రప్రదేశ్ వెనుకంజే.

పై విశ్లేషణ బట్టి తెలిసేదేమిటంటే మనం దేశంలో పోలిస్తే వెనుకబడి వుండడమే. ప్రధాన రాష్ట్రాలతో పోలిస్తే ప్రాథమికరంగంలో రెండవస్థానంలో, ద్వితీయరంగంలో ఏడవస్థానంలో, సర్వీసుల రంగంలో 10వస్థానంలో వున్నాం. మౌలిక సదుపాయాలు కల్పించి ద్వితీయరంగంలో అభివృద్ధి పెంచుకోవలసిన ఆవశ్యకత ఎంతైనా వుంది.

ప్రధాన రాష్ట్రాల వారీగా వివిధ రంగాల్లో
స్థూలరాష్ట్ర ఆదాయంలో అభివృద్ధి రేటు
(సగటు 1993-94 నుండి 2000-01 వరకు) ప్రస్తుత ధరల్లో (%)

| రాష్ట్రం | ప్రాథమిక రంగం | ద్వితీయ రంగం | సర్వీసుల రంగం | మొత్తం స్థూల రాష్ట్ర అభివృద్ధి రేటు |
|---|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 10.36 | 11.35 | 13.02 | 11.60 |
| అస్సాం | 6.42 | 15.24 | 9.81 | 9.12 |
| బీహారు | 13.24 | 24.10 | 16.39 | 15.66 |
| గుజరాత్ | 3.52 | 10.21 | 12.33 | 9.47 |
| హర్యానా | 9.45 | 11.19 | 17.20 | 12.61 |
| కర్ణాటక | 9.89 | 12.62 | 16.97 | 13.51 |
| కేరళ | 6.43 | 13.72 | 18.61 | 14.27 |
| మధ్యప్రదేశ్ | 5.41 | 10.34 | 11.69 | 8.94 |
| మహారాష్ట్ర | 5.44 | 9.81 | 12.90 | 10.38 |
| ఒరిస్సా | 3.48 | 4.88 | 12.26 | 6.80 |
| పంజాబు | 10.04 | 12.61 | 14.51 | 12.15 |
| రాజస్థాన్ | 6.80 | 10.82 | 13.13 | 10.29 |
| తమిళనాడు | 9.35 | 10.21 | 17.35 | 11.90 |
| ఉత్తరప్రదేశ్ | 9.05 | 10.56 | 13.94 | 11.36 |
| పశ్చిమ బెంగాల్ | 10.25 | 12.78 | 16.85 | 13.75 |
| **భారతదేశం** | **9.64** | **11.01** | **14.53** | **12.09** |

గణాంకాలు వివిధ రాష్ట్రాల బడ్జెట్లనుంచి సేకరించబడ్డాయి. ❐

# ప్రపంచగమనం

- రావు దేవభక్తుని

ప్రపంచవ్యాప్తంగా కొద్దిపాటి మినహాయింపులతో అమలు జరుగుతోన్న ఉదారవాద ఆర్థిక విధానాల పర్యవసానాలను ప్రజలపైన, దేశాలు, ఖండాలపైన విశ్లేషించడమే ఈ వ్యాసం లక్ష్యం. మొదట అందుబాటులోకి వచ్చిన 2001 వ సంవత్సరం. జూలై మాసం నాటి ప్రపంచ ఆర్థిక వ్యవస్థ, పెరిగిపోతోన్న ధనిక-పేద వ్యత్యాసాలను పరిశీలిద్దాం.

**పేదరికం** : ప్రపంచంలోని నిరుపేదలలో సగం మంది మన దక్షిణ ఆసియా ఖండంలోనే వుండడం ఇక్కడ గమనార్హమైన విషయం. ఇక మిగిలిన పేద జనాభాలో పావువంతు మంది సబ్-సహారా ప్రాంత ఆఫ్రికాలో వున్నారు. చివరగా మిగిలిన మరో పావుమంది పేదలు తూర్పు ఆసియాలో, ప్రధానంగా చైనాలో వున్నారు. కాగా జనాభా నిష్పత్తిగా చూస్తే పేదరికం పాలు ఆఫ్రికాలోనే ఎక్కువగా కేంద్రీకృతం అయి ఉంది. 2001 నాటి అధ్యయనాల ప్రకారమే ప్రపంచంలోని కుటుంబాల మధ్య అసమానతలు తీవ్రతరం అయ్యాయి. ఈ ధోరణి 2002వ సంవత్సరంలోనూ కొనసాగింది. ప్రపంచంలోని అత్యంత ధనిక 1% (50 మిలియన్ల మంది) జనాభాకు సమానంగా వుండడం ధనిక-పేద ఆర్థిక వ్యత్యాసాలకు అద్దం పడుతోంది. మించి, గత దశాబ్దపు మధ్యకాలంలో ప్రపంచ ఆదాయ పెరుగుదలలో వాటా మొత్తం, అత్యంత ధనికులైన పై 20% వర్గం వారికే దక్కింది. కాగా, క్రింది వర్గంలో వున్న నిరుపేదల ఆదాయం వాస్తవానికి తగ్గిపోయింది.

ఇక ఇక్కడ గమనించవలసిన ఒక ప్రత్యేక అంశం వున్నది. అదే, ఈ కాలంలో తూర్పు ఆసియాలో, ముఖ్యంగా చైనాలో పేదరికం గణనీయంగా తగ్గడం. ఈ పరిస్థితి ప్రత్యామ్నాయ ఆర్థిక విధానాల తాలూకు ప్రాధాన్యతకు అద్దం పడుతోంది. కాగా, గత దశాబ్ద కాలంలో ఆఫ్రికా, దక్షిణ ఆసియా, తూర్పు యూరప్‌లలో పేదరికం పెరిగి పోయింది. ఈ ధోరణి ఈనాటికీ కొనసాగుతోంది. మరో ప్రక్కన ప్రపంచ ఆర్థిక వ్యవస్థ కుంచించుకు పోవడం ఈ పేదప్రజలకు, దేశాలకు, ఖండాలకు గోరుచుట్టపై రోకలిపోటుగా వున్నది.

రెండు దశాబ్దాల కాలంలో ప్రప్రథమంగా 2001వ సంవత్సరం ద్వితీయ అర్ధ భాగంలో ప్రపంచంలోని అతి పెద్ద ఆర్థిక వ్యవస్థలు మాంద్యానికి లోనయ్యాయి. ఈ మాంద్యం రోజు రోజుకు విస్తృతం, ప్రగాఢం అవుతోంది. "ధనిక దేశాల క్లబ్బు"గా పేరుమోసిన 30 అత్యంత అభివృద్ధి చెందిన దేశాల సంస్థ అయిన ఒఇసిడి అంచనాల ప్రకారమే 2001-2002 సంవత్సరాలలో ఆర్థిక అభివృద్ధి 1% మించలేదు. ఈ పరిస్థితి 2003వ సంవత్సరంలో మెరుగుపడవచ్చునని ఒఇసిడి అంచనా. అయితే 2002వ సంవత్సరపు ప్రపంచ ఆర్థికక్రమపు తీరు తెన్నులను గమనించిన ఎవరికైనా ఈ అంచనా ఉత్త భ్రమ మాత్రమేనని అర్థంకాక మానదు.

ఒఇసిడి ఈ అంచనాలను వేసేనాటికే జపాన్ పరిస్థితి పూర్తి నిరాశాజనకంగా వున్నది. ఇది నేడు మరింతగా దిగజారిపోయింది. కాగా 2001 సంవత్సరంలో కాస్తంత బలంగా వున్నట్లుగా కనపడిన (ఒఇసిడి దృష్టిలో) యూరప్ పరిస్థితి కూడా నేడు పెనంమీద నుంచి పొయ్యిలో పడినట్లుగా క్రమేణ మారుతోంది. కాగా అటు అమెరికాలో గానీ, ఇటు ఇతర అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాలలోగానీ పారిశ్రామిక కుటుంబాలకు సెప్టెంబరు 11 తీవ్రవాద దాడులను సాకుగా చూపడం నేడు ఒక ఫ్యాషన్‌గా మారింది. ఇలా భావించబడడమే పెట్టుబడిదారీ వ్యవస్థకు అవసరమైన భ్రమ. వాస్తవానికి ఈ దాడులకు ముందునుంచే, అంటే 2000 సంవత్సరంలో అర్థభాగంనుంచే అమెరికా ఆర్థిక వ్యవస్థ పతనం ఆరంభం అయ్యింది. సెప్టెంబరు 11 ఘటనల తరువాత కొద్దికాలంపాటు ఈ క్రమం వేగిరం అయ్యింది. తరువాత యధావిధి ఆర్థిక పతనం "స్థిరపడి ముందుకు" సాగుతున్నది.

అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో వినియోగదారుల కొనుగోళ్ళు కొడిగడుతుండడం, వాణిజ్య పెట్టుబడులు తగ్గిపోతుండడం, గల్ఫ్ ప్రాంతంలో యుద్ధ వాతావరణం వలన చమురు ధరలు పెరగడం, మరింత తీవ్రమైన ఆర్థిక మాంద్యానికి కారణం అవుతున్నాయి. ఈ పరిస్థితిలో ప్రపంచంలోని ఏ ప్రాంతమూ ఈ ఆర్థిక మాంద్య పరిస్థితి నుంచి ప్రపంచాన్ని దట్టెక్కించే స్థితిలో లేకపోవడం గమనార్హం. ఈ విషమ పరిస్థితినుంచి పెట్టుబడి దారీ వ్యవస్థను అమెరికా ప్రయోగించిన ద్రవ్య ఆయుధమైన వడ్డీరేట్ల తగ్గింపు దారుణంగా విఫలం అయింది. ఇక మరొక అస్త్రంగా తీవ్రవాదం సాకు చూపి "ధూర్తదేశాలపై" దాడుల

పేరిట అమెరికా, స్థానిక యుద్ధాలకు తెర తీస్తోంది. ఆఫ్ఘన్ యుద్ధం, నేటి ఇరాక్‌పై యుద్ధ సన్నాహాలు, పాలస్తీనా-ఇజ్రాయిల్ ఘర్షణలు, యుద్ధాలను మనం ఈ నేపథ్యంలోనే చూడగలం.

సమాచార సాంకేతిక పరిజ్ఞాన ఉత్పత్తుల "ప్రపంచీకరణ" జరిగిన విషయం తెలిసిందే. ఈ స్థితిలో తూర్పు ఆసియా కంప్యూటర్ సంబంధిత ఉత్పత్తులకు తగ్గిపోయిన డిమాండ్‌వలన తీవ్ర సంక్షోభాన్ని ఎదుర్కుంటోంది. ప్రపంచ పెట్టుబడి మార్కెట్లలో సంక్షోభాలు లాటిన్ అమెరికాను కబళిస్తున్నాయి. ఆసియా ఆర్థిక సంక్షోభపు మూడు - నాలుగు సంవత్సరాల తరువాత కూడా "అభివృద్ధి చెందుతున్న" దేశాలలోనికి ప్రైవేటు పెట్టుబడుల ప్రవాహం ప్రతికూల దిశలోనే సాగుతున్నది. ఈ నేపథ్యంలోనే అంతర్జాతీయ ద్రవ్యనిధే స్వయంగా ఇటువంటి హెచ్చరికను చేయడం గమనార్హం....."సమర్థవంతమైన నియంత్రణ, బలమైన ఆర్థిక వ్యవస్థను ఏర్పరచుకున్న తరువాత మాత్రమే వివిధ దేశాలు తమ ఆర్థిక మార్కెట్లను తెరవడాన్ని అప్రమత్తంగా సాగించాలి. "....ఇది స్వయానా అంతర్జాతీయ ద్రవ్యనిధి హెచ్చరిక. అయితే మనదేశ పాలకులకు మాత్రం ఇదేమీ పెద్దగా పట్టినట్లుగా కనపడడం లేదు. ఇది వినాశకరం.

**యూరప్** : అంతర్జాతీయ ద్రవ్యనిధి 2001వ సంవత్సరం సెప్టెంబరు నెలలో చేసిన హెచ్చరిక ప్రకారమే, యూరప్ లోతైన ఆర్థిక సంక్షోభం అంచున వున్నది. సాంకేతిక రంగం కుదేలవడం, వినియోగదారుల కొనుగోళ్ళు పడిపోవడం, సెప్టెంబరు 11 అమెరికా తీవ్రవాద దాడులను ఈ పరిస్థితికి కారణాలుగా ద్రవ్యనిధి పేర్కొన్నది. ప్రధానంగా జర్మనీ, ఇటలీలు - ఈ సంక్షోభంలో బాగా దెబ్బ తింటాయని ద్రవ్యనిధి వివరించింది. ఇక తూర్పు యూరప్‌లో కూడా 2000 సంవత్సరపు ఆర్థిక ఎదుగుదల మంచులా కరిగిపోవడాన్ని ప్రస్తావించింది. పశ్చిమ యూరప్‌ను పీడిస్తున్న సమస్యలుగా ద్రవ్యనిధి గుర్తించినవి. (1)చమురు, ఆహారధరలు నింగినంటడం వలన ద్రవ్యోల్బణం పెరగడం, నిజ ఆదాయాలు పడిపోవడం, (2) ఫిన్లాండ్, నెదర్లాండ్, స్వీడన్, జర్మనీలలో సాంకేతిక తిరోగమనం వలన ఆర్థిక పతనం. అమెరికా, ఆసియాలలో ఆర్థిక మాంద్యం ప్రభావం పశ్చిమ యూరప్‌పై పడడం (4) నిరుద్యోగ సమస్య పెరగడం (5) సెప్టెంబరు 11 అమెరికాలోని తీవ్రవాదదాడుల ప్రభావం - వినియోగదారుల కొనుగోళ్ళపై పడడం.

జర్మనీ, ఇటలీలను ఈ ఆర్థిక సంక్షోభపు పెనుముప్పుల అంచున వున్న దేశాలుగా "గుర్తించిన" ద్రవ్యనిధి, ఇప్పుడు ఆ జాబితాకు ఫ్రాన్స్‌ను కూడా చేర్చడం గమనార్హం. మరో ప్రక్కన రష్యా ఆర్థిక సంక్షోభంలోకి మరింతగా దిగజారుతోంది. గతంలోని సోవియట్ యూనియన్‌లోని ఇతర దేశాలపరిస్థితి కూడా దిగజారిపోతోంది. ఇక టర్కీ పరిస్థితి పతనం అంచున వున్నది. ఇతర దేశాలలో ఆర్థిక వ్యవస్థలు "ఒక మోస్తరుగా" బలహీనపడుతుండగా టర్కీ కరెన్సీ విలువ దారుణంగా పడిపోతోంది, స్టాక్ మార్కెట్ కుప్పకూలిపోయింది. పారిశ్రామిక రంగం తేరుకోలేని దెబ్బలు తింటోంది. పోలెండ్ ఆర్థిక వ్యవస్థ కూడా అదుపుతప్పిపోయింది. ఇక ఒక్క యుగోస్లావియాకు మాత్రమే ద్రవ్యనిధి కితాబులను ఇచ్చింది. ఆదేశం "సంస్కరణల"ను వేగంగా అమలు జరుపుతూ వుండడమే దీనికి కారణం. మరో ప్రక్కన ద్రవ్యనిధే స్వయంగా యుగోస్లావియా ఆర్థిక పరిస్థితి గురించి నిరాశను వ్యక్తీకరించడం ఆ సంస్థ వంచనకు నిదర్శనం.

**జపాన్** : ప్రపంచంలోని రెండవ పెద్ద ఆర్థిక వ్యవస్థ దశాబ్ద కాలంగా ఆర్థిక సంక్షోభంలో కొట్టుమిట్టాడుతోంది. జపాన్ ఆర్థిక వ్యవస్థ స్థాయి దృష్ట్యా, ఆ వ్యవస్థలో ఏర్పడే సంక్షోభాలు మొత్తం ప్రపంచానికి ప్రధానంగా తూర్పు ఆసియాకు వినాశకరంగా వుండగలవని ద్రవ్యనిధి పేర్కొంది. వడ్డీరేట్లను దరిదాపు - సున్నాకు తగ్గించినా జపాన్ ఆర్థిక వ్యవస్థ కృంగిపోతూనే వున్నది. ఇది ప్రపంచ వ్యాపితంగా ద్రవ్యవిధానాలు దివాలా తీసాయనడానికి మరో మచ్చుతునక. ఈ నేపథ్యంలోనే తూర్పు ఆసియా దేశాలు తమ ఎగుమతులలో సుమారు 12% మేరకు జపాన్‌కు చేస్తున్న పరిస్థితిని గమనించాలి.

నూతనంగా పారిశ్రామికీకరణను సాధించిన దేశాలు అయిన కొరియా, సింగపూర్, తైవాన్, మలేషియాల పరిస్థితి నేడు అతలాకుతలం అవుతున్నది. ఇక చైనా ఆర్థిక పరిస్థితి మాత్రమే ఎదుగుదల దిశగా సాగుతోందని ద్రవ్యనిధి అంగీకరించక తప్పలేదు. ఈ దేశంలోకి విదేశీ పెట్టుబడులు పుష్కలంగా వస్తున్నాయి. ప్రైవేటు వినియోగస్థాయి దృఢంగా వున్నది.

కాగా మనదేశంలో కరువు, చమురు ధరలు, గుజరాత్ భూకంపాల వలన పరిస్థితి కొడిగడుతుందని నిధి శలవిచ్చింది. అయితే తాను శాసిస్తోన్న వ్యవస్థాగత సర్దుబాట్ల కార్యక్రమాలలో ముందున్నది గనుక కాస్తంతగా భారతదేశాన్ని శ్లాఘించడం ద్రవ్యనిధికి తప్పనిసరి అని దాని ప్రకటన తెలియచేస్తోంది.

ఆఫ్రికా పరిస్థితి కూడా అంతంత మాత్రమేనని ద్రవ్యనిధి అంగీకరించింది. ప్రధానంగా ప్రాథమిక సరుకుల (ముఖ్యంగా కాఫీ) ధరలు పడిపోవడంవలన, వాటి ఎగుమతులపై ఎక్కువగా ఆధారపడిన ఆఫ్రికా పరిస్థితి ముందు నుయ్యి, వెనుక గొయ్యిగా వుంది. ఆహార ఉత్పత్తుల ప్రపంచ మార్కెట్ ధరలు పడిపోవడం వలన కెన్యా, ఉగాండా నష్టపోతున్నాయి. పత్తి ధరలు పడిపోవడం వలన బెనిన్, ఛాద్, మాలీలు సంక్షోభంలో వున్నాయి. పొగాకు ధర పడిపోవడంవలన మాలీవీ, జింబాబ్వేలు క్లిష్ట పరిస్థితిలో వున్నాయి. అల్యూమినియం, రాగి ధరలు పడిపోవడంవలన మొజాంబిక్, జాంబియాలు దిక్కు తోచని

(మిగతా 21వ పేజీలో)

# సేవారంగం - సామ్రాజ్యవాద ప్రపంచీకరణ

-ఎన్. వేణుగోపాల్

**ఇటీవల** కాలంలో మానవ జీవితంలో, ఆర్థిక వ్యవస్థలో సేవారంగ ప్రాధాన్యత చాలా పెరిగిపోతోంది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విస్తరణకూ, సేవారంగం పాత్ర పెరుగుదలకూ ప్రత్యక్ష సంబంధం ఉంది. సేవారంగం అంటే ఏమిటో, దానికి సాంఘిక, ఆర్థిక రంగాలలో గల పాత్ర ఏమిటో, సామ్రాజ్యవాద ప్రపంచీకరణ శక్తులు సేవారంగం మీద ఎందుకు కేంద్రీకరిస్తున్నాయో, ఈ సేవరంగ విస్తృతి వల్ల సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాల మీద ఎటువంటి ప్రభావం ఉండబోతోందో విశ్లేషించడం ఈ వ్యాసం లక్ష్యం.

## సేవా రంగం అంటే ఏమిటి?

సాంప్రదాయకంగా ఆర్థిక వ్యవస్థను మూడు రంగాలుగా విభజిస్తారు. వ్యవసాయం, గనుల తవ్వకం వంటి ప్రకృతి ఆధారిత ఆర్థిక కార్యకలాపాలను ప్రాథమిక రంగంగాను, వస్తూత్పత్తి, నిర్మాణం వంటి పారిశ్రామిక కార్యకలాపాలను ద్వితీయ రంగంగాను, పాలన, సైనిక, రక్షణ వ్యవస్థలు, ఆధ్యాపకత్వం, గుమాస్తాలపని, వైద్య, న్యాయ సంబంధ సేవలు, బట్టలు ఉతకడం, కుట్టడం, క్షౌరం చేయడం వంటి వ్యక్తిగత సేవలు మొదలైన ఆర్థిక కార్యకలాపాలనన్నింటిని తృతీయ రంగంగా, సేవారంగంగా పిలవడం అలవాటు.

పెట్టుబడిదారీ అభివృద్ధి పెరిగినకొద్దీ సేవారంగం విస్తరిస్తూ ఉంటుంది. కొత్త సేవలుగా ఉండినవి కూడా పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలలో కొత్త అర్థాలు సంతరించుకుని మార్కెట్ పరిధిలోకి వస్తాయి. ఈ యుగంలో సేవలను మానవ శరీరానికి సంబంధించిన సేవలు, మానవుల మనసుకు సంబంధించిన సేవలు అమూర్తమైన ఆస్తులకు సంబంధించిన సేవలు. వాటిని నాలుగు రకాలుగా విభజిస్తున్నారు.

మన నిత్య జీవితంలో మనం అనుక్షణం ప్రత్యక్షంగా గాని పరోక్షంగా గాని వినియోగిస్తున్న సేవలు ఎన్నో ఉన్నాయి. వాటిలో కొన్ని అసలు "సేవ" లేనా, వాటిని మనం అవసరం కొద్దీనే వాడుకుంటున్నామా అనేవి తీవ్రంగా ఆలోచించవలసిన ప్రశ్నలు. సాధారణంగా పెట్టుబడిదారీ సరుకులు వినియోగదారులలో ఉపయోగపు కోరికలు పెంచి, మార్కెట్లను సృష్టించుకున్నట్టుగానే, ఈ"సేవ"లు ప్రజల అవసరంతో సంబంధంలేకుండానే మార్కెట్లను సృష్టించుకుంటున్నాయి.

సామ్రాజ్యవాద ప్రపంచీకరణ తర్వాత అన్ని సరుకులలోను అమ్మేవారి అంగళ్ళు పెరిగిపోయినట్లుగానే, సేవారంగంలో కూడా సేవల ఉత్పత్తిదార్ల, సేవల అమ్మకం దార్ల సేవల మారుబేరగాళ్ళ వ్యాపారం ఇబ్బడి ముబ్బడిగా పెరిగిపోయింది. ఇంతవరకూ మనం గుర్తించని సేవలు, వినియోగించని సేవలు మన అనుభవంలోకి రావడం మొదలయింది. ఇంతవరకూ మార్కెటేతర సంబంధాలలో, సంక్షేమ రంగాలలో, ప్రభుత్వ రంగాలలో ఉన్న సేవలు కూడా మార్కెట్ చట్రంలోకి, లాభనష్టాల లెక్కల్లోకి, ప్రైవేటు రంగంలోకి రావడం మొదలయింది.

ఈ నేపథ్యంలో ఇవాళ సామ్రాజ్యవాద దేశాల గుత్తాధిపత్యంలో ఉండి, ఏదో ఒక మేరకు భారతదేశం వంటి దేశాలలోకి ప్రవేశిస్తున్న సేవలను చూడవలసి ఉంటుంది. ఇవాళ్టి సేవారంగంలో బ్యాంకింగ్, ఇన్సూరెన్స్, న్యాయసేవలు, విమానయానం, సముద్రయానం, రోడ్డు రవాణా వంటి ప్రయాణ సౌకర్యాలు, సరుకుల రవాణా, పర్యాటక రంగం, హోటళ్ళు, విద్య, వైద్య, ఆరోగ్యం ప్రజాపాలన వంటి ప్రభుత్వ సేవలు, సినిమాలు, టెలివిజన్ సాఫ్ట్‌వేర్ వంటి వినోద సేవలు, టెలికమ్యూనికేషన్స్, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, అందాన్ని, శరీర సౌష్టవాన్ని తీర్చిదిద్దడం వంటి శారీరక, వ్యాయామ సేవలు, యంత్రాల మరమ్మత్తు, నిర్వహణ వంటి సేవలు, రక్షణ, పారిశ్రామిక కాపలా వంటి సేవలు ఎన్నో ఉన్నాయి. ఇంకా ఎన్ని కొత్త సేవలను కనిపెట్టి వాటి మార్కెట్‌ను ఎలా సృష్టించాలా, ఎట్లా విస్తరించాలా అని బహుళజాతి సంస్థలు ఆలోచిస్తున్నాయి. సేవారంగం మీద బహుళజాతి సంస్థల ఈ అతి శ్రద్ధ వెనుక చారిత్రక, భౌతిక కారణాలున్నాయి.

## సామ్రాజ్యవాద ఆర్థిక వ్యవస్థలో మార్పులు - సేవారంగం :

గత కొన్ని దశాబ్దాలుగా సామ్రాజ్యవాద దేశాల ఆర్థిక వ్యవస్థలలో వస్తున్న మార్పులు సేవారంగ ప్రాధాన్యాన్ని పెంచుతున్నాయి. అమెరికా ఆర్థిక వ్యవస్థలోను, యూరప్ దేశాల ఆర్థిక వ్యవస్థలలోను జాతీయోత్పత్తి ఉత్పాదక రంగపు వాటా తగ్గిపోతూ, అనుత్పాదక, సేవా రంగపు వాటా పెరిగిపోతున్న పరిణామం ఇటీవలి దశాబ్దాలలో ప్రస్ఫుటంగా ఉంది.

ఈ పరిణామానికి గల కారణాలను పరిశీలిస్తే, ఆ దేశాలన్నింటిలోనూ, ముఖ్యంగా అమెరికాలోను, ఇటీవలి వరకూ ప్రధాన పరిశ్రమగా ఉన్న యుద్ధ పరికరాల పరిశ్రమ వాటా ప్రచ్ఛన్న యుద్ధానంతరం తగ్గిపోతూ వస్తోంది. నూతనంగా, పారిశ్రామికీకరణ చెందిన దేశాలుగా గుర్తించబడుతున్న దక్షిణ కొరియా, తైవాన్, సింగపూర్ వంటి దేశాలలో

పారిశ్రామిక సరుకులు అంతర్జాతీయ సామ్రాజ్యవాద దేశాల ఎగుమతులను సవాల్ చేస్తోంది. పారిశ్రామిక సరుకుల అంతర్జాతీయ వాణిజ్యంలో ఇవాళ ఈ నూతన పారిశ్రామిక దేశాలు అర్ధభాగాన్ని తమ చేతుల్లో పెట్టుకున్నాయని, 2025 నాటికి ఈ వాటా 60 శాతానికి పెరిగిపోవచ్చునని ఒక అంచనా. ఈ పరిణామంతోపాటు, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ ప్రాబల్యం పెరిగిపోవడంతో సామ్రాజ్యవాద దేశాల ఆర్థిక వ్యవస్థల జాతీయోత్పత్తిలో వ్యసాయ రంగం వాటా పెరిగి పోతోంది.

సామ్రాజ్యవాద దేశాలలో సేవారంగం ఈ విధంగా విపరీతంగా పెరిగిపోతుంటే, సరుకుల ఉత్పత్తిలో వచ్చినట్లే అధికోత్పత్తి సంక్షోభాలు రావడం మొదలయింది. సేవారంగ బహుళజాతి సంస్థల మధ్య కుత్తుకలు కత్తిరించుకునే పోటీ మొదలయింది. ఈ సంక్షోభాల నుంచి బయట పడడానికి బహుళజాతి సంస్థలు పన్నిన వ్యూహం ఈ సేవలను ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలకు అలవాటుచేసి కొత్త మార్కెట్లను సృష్టించుకుని సేవలను ఎగుమతి చేయడం. ఈ సేవలలో చాల సేవలు అందించడానికి అవసరమైన మౌలిక సాధన సంపత్తిని సమకూర్చడం కూడా పారిశ్రామిక రంగంలోని బహుళజాతి సంస్థలు చేసే పనే కాబట్టి ఈ రకంగా సేవారంగ ఎగుమతి, పారిశ్రామిక పరికరాల ఎగుమతికి కూడా దారి తీస్తుంది. అంతేగాక, సేవారంగం అభివృద్ధిలోనూ అనేక చారిత్రక, రాజకీయార్థిక, సాంకేతిక కారణాల వల్ల సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థలకే హెచ్చు అవకాశాలున్నాయి. కనుక కొత్త పారిశ్రామిక దేశాల వాణిజ్య అవకాశాలను దెబ్బదీయడానికి ఒక మార్గంగా కూడా సామ్రాజ్యవాద దేశాలు సేవారంగం వైపు దృష్టి సారిస్తున్నాయి.

సామ్రాజ్యవాద దేశాల ఆర్థిక వ్యవస్థల జాతీయోత్పత్తిలో సేవారంగం 60 నుంచి 75 శాతం వరకు వాటా కలిగి ఉండడంతో ఈ సేవల ఎగుమతిలో, అంతర్జాతీయ వాణిజ్యంలో కూడా ఆ దేశాలదే పైచేయిగా ఉంది. మొత్తం ప్రపంచ వాణిజ్యంలోని సేవారంగం ఎగుమతులలో 50 శాతాన్ని కేవలం ఐదు దేశాలు - అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ, జపాన్ - శాసిస్తున్నాయి. దీన్ని మరో వైపు నుంచి చూస్తే సేవల వాణిజ్యంలో 94 శాతం కేవలం 73 బహుళజాతి సంస్థల గుప్పెట్లో ఉంది. సేవారంగ ఎగుమతులలో, వాణిజ్యంలో అగ్రభాగాన ఉన్న 82 బడా బహుళజాతి సంస్థలలో మొదటి 51 అమెరికా, జపాన్‌లకు చెందినవే.

ఈ కారణాలవల్ల సేవారంగానికి అంతర్జాతీయ వాణిజ్యంలో తమకు అనుకూలమైన ఒడంబడికలు, సూత్రాలు అమలులో ఉండాలని బహుళజాతి సంస్థలు భావించాయి. అంతర్జాతీయ వాణిజ్య సూత్రాలను తమ మార్కెట్ విస్తరణకు, లాభార్జనకు అనుకూలంగా మార్చవలసిందిగా, రూపొందించవలసిందిగా ప్రభుత్వాల మీద ఒత్తిడి తేవడం ప్రారంభించాయి. అందువల్లనే జనరల్ అగ్రిమెంట్ ఆన్ టారిఫ్స్ అండ్ ట్రేడ్ (గాట్) చర్చల్లో ఎప్పుడూ లేని సేవారంగం 1980ల్లో ఉరుగ్వే చర్చలతో ప్రవేశించింది.

## గాట్ చర్చల్లోకి సేవారంగ ప్రవేశం :

గాట్ 1947లో ఏర్పడి 1986 వరకు ఏడుసార్లు చర్చలు జరిగి, తొలి ఒప్పందానికి సవరణలు, చేర్పులు, మార్పులు జరిగినప్పటికీ, అప్పటివరకూ కేవలం పారిశ్రామికోత్పత్తుల వాణిజ్యానికే ఆ ఒప్పందం వర్తించేది. ఉరుగ్వేలో ప్రారంభమైన ఎనిమిదవ దఫా చర్చలలో 1986 నుంచి గాట్ పరిధిలోకి కొన్ని కొత్త రంగాలను ప్రవేశపెట్టాలని బహుళజాతి సంస్థలు ప్రయత్నాలు ప్రారంభించాయి. ఆ విధంగా గాట్ చర్చలలోకి కొత్తగా ప్రవేశించిన రంగాలలో ఒకటి సేవారంగం, అప్పటికే సేవారంగంలో స్థిరపడి వున్న బహుళజాతి సంస్థలు సేవారంగ వాణిజ్యంపై ఆంక్షలను తొలగించేందుకు మూడో ప్రపంచ దేశాలపై ఒత్తిడి తేవాలని, తమ శాఖలను ఏ దేశంలోనైనా తెరుచుకునేందుకు హక్కు కల్పించాలని తమ దేశాల ప్రభుత్వాలను ఒప్పించాయి.

ఉరుగ్వే చర్చలలో భాగంగా ప్రతిష్టంభన తొలగించడానికి తయారయిన డంకెల్ డ్రాఫ్ట్ సేవారంగ వాణిజ్య ఒడంబడిక అవసరం గురించి తొలిసారిగా మాట్లాడింది. అయితే డంకెల్ డ్రాఫ్ట్‌లోగాని, సామ్రాజ్యవాద దేశాల ప్రభుత్వాల వాదనలలోగాని వ్యక్తమైన అభిప్రాయాలు నిజానికి సేవారంగంలో పనిచేస్తున్న బహుళజాతి సంస్థలు రూపొందించి ఇచ్చినవే.

రెండువందలకు పైగా బహుళజాతి సంస్థల భాగస్వామ్యంతో ఏర్పడిన మల్టీ లేటరల్ ట్రేడ్ నెగోషియేషన్స్ కోయలిషన్ అనే సంస్థ కొత్త గాట్ ఒప్పందంతో ఏయే అంశాలు ఉండాలనే విషయంలో తమ ప్రభుత్వాలపై ఒత్తిడి తేవడానికి డంకెల్ డ్రాఫ్ట్ కన్న ముందునుంచే ప్రయత్నాలు ప్రారంభించింది. ఈ కోయలిషన్ అమెరికన్ ఎక్స్‌ప్రెస్, సిటిబ్యాంక్, ఐ.బి.ఎం. వంటి సేవారంగ బహుళజాతి సంస్థలు ఉన్నాయి. సరిగ్గా ఈ పనికోసమే తయారయిన మరొక కూటమి ఇంటలెక్చువల్ ప్రాపర్టీ కోయలిషన్‌లో కూడా సేవారంగానికి ప్రాతినిధ్యం వహించే బహుళజాతి సంస్థలు ఉన్నాయి. వీటితోపాటు 1982 నుంచి అమెరికా సేవారంగ వాణిజ్యంలో బేరసారాలు నడుపుతున్న కూటమి యు.ఎస్.కోయలిషన్ ఆఫ్ ఇండస్ట్రీస్ కూడ గాట్ చర్చలను ప్రభావితం చేయడానికి ప్రయత్నించింది.

ఈ అన్ని ప్రభావాలు, ఒత్తిళ్ళ ఫలితంగా ఉరుగ్వే చర్చల చివర గాట్‌కు సమాంతరంగా జనరల్ అగ్రిమెంట్ ఆన్ ట్రేడ్ ఇన్ సర్వీసెస్ రూపొందింది. ఈ గాట్స్‌మీద సంతకాలు 1995లో ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యు.టి.ఓ.)తో పాటే జరిగాయి. "అమెరికన్ ద్రవ్య సేవారంగం, ముఖ్యంగా అమెరికన్ ఎక్స్‌ప్రెస్, సిటి కార్ప్ వంటి సంస్థలు తెచ్చిన ఒత్తిడే లేకపోతే సేవారంగ ఒప్పందమే జరిగి ఉండేది కాదు" అని డబ్ల్యు.టి.ఓ. సేవారంగ విభాగం డైరెక్టర్ డేవిడ్ హార్ట్రిడ్జ్ అన్నాడంటే, గాట్స్‌కోసం తెర వెనుక ఎంత బలమైన ప్రయత్నాలు జరిగాయో అర్థమవుతుంది.

గాట్స్‌లో భాగంగా బహుళజాతి సంస్థలు సేవారంగ వాణిజ్యానికి సంబంధించి అనేక అవకాశాలు కోరుకున్నాయి. వాటిలో ముఖ్యంగా

అన్ని రకాల సేవల వాణిజ్యానికి అన్ని దేశాలూ అంగీకరించాలని, సేవారంగ వాణిజ్యంలో కూడ ఎగుమతులు చేసే దేశాన్ని 'అతిప్రాధాన్య దేశం'గా గుర్తించి ఎక్కువ అవకాశాలు ఇవ్వాలని, సేవా రంగ వాణిజ్యంలో ఏయే చర్యలు తీసుకోబోతున్నామో పారదర్శకంగా, బహిరంగంగా ప్రకటించాలని, సేవారంగంలో ప్రభుత్వ రంగంలో ఉన్న గుత్తాధిపత్య సంస్థలను రద్దు చేయాలని, విదేశీ సేవారంగ సంస్థలకు స్వదేశీ సేవారంగ సంస్థలతో సమాన ప్రతిపత్తి ఇవ్వాలని, అటువంటి మరెన్నో డిమాండ్లను ఈ బహుళజాతి సంస్థలు ముందుకు తెచ్చాయి. సేవారంగ బహుళజాతి సంస్థలలోనే అమెరికన్, యూరోపియన్, జపనీస్ సంస్థల మధ్య ఉన్న విభేదాల వల్ల, వ్యాపార పోటీల వల్ల ఈ డిమాండ్లన్నీ పూర్తిగా నెరవేరలేదు. గాట్స్ మీద సంతకాలు జరిగే నాటికి అది విమానయాన, సముద్రయాన సేవలు, బ్యాంకింగ్, ఇన్సూరెన్స్, పర్యాటక రంగం, రవాణా రంగం వంటి కొన్ని రంగాలకే పరిమితమై పోయింది. టెలీకమ్యునికేషన్స్ రంగంలో వాణిజ్యం కోసం మరొక ఒప్పందం చేసుకోవలసి వచ్చింది.

అమెరికాలోని సియాటిల్‌లో 1999లో జరిగిన డబ్ల్యు.టి.ఓ. మంత్రివర్గ సమావేశంలో గాట్స్ పరిధిని విస్తరించాలని, విద్య, ఆరోగ్య, సాంకేతిక సేవలను కూడా ఆ పరిధిలోకి తీసుకురావాలని అమెరికన్ బహుళజాతి సంస్థలు ప్రయత్నాలు ప్రారంభించాయి. సియాటిల్‌లో జరిగిన డబ్ల్యు.టి.ఓ. వ్యతిరేక ప్రదర్శనవల్ల కొంత, అమెరికన్, యూరోపియన్ ప్రయోజనాల మధ్య ఘర్షణ వల్ల కొంత ఆ ప్రయత్నం ఫలించలేదు. ఐదు సంవత్సరాలకు ఒకసారి గాట్స్‌ను పునఃసమీక్షించా లనే నిబంధన ఒకటి దానిలో ఉండడం వల్ల ఫిబ్రవరి 2000 నుంచి ఆ దిశగా చర్చలు సాగుతున్నాయి.

## భారతదేశం - సేవారంగం :

భారత ఆర్థిక వ్యవస్థలో, ముఖ్యంగా జాతయాదాయ గణాంకాలలో, సేవారంగం ప్రాధాన్యత, సేవారంగం వాటా విపరీతంగా పెరిగిపోతోంది. ఈ పెరుగుదల చాల ఆరోగ్యకరమైనదని, దేశాభివృద్ధికి, జీవన ప్రమాణాల మెరుగుదలకు అది ఒక సూచన అని పాలక వర్గాలు, పాలక వర్గ అనుకూల ఆర్థిక వేత్తలు ప్రచారం చేస్తున్నారు. జాతీయాదా యంలో సేవారంగ భాగస్వామ్యం 1950-51ల్లో 26.6 శాతం ఉన్నదల్లా 1999-2000లో 48.49 శాతానికి పెరిగింది.

ఈ పరిణామాన్ని 1970ల్లోనే గుర్తించిన అశోక్‌మిత్రా, "భారత దేశంతో పోల్చదగిన అభివృద్ధి దశలో ఉన్న మరే ఇతర దేశం కన్నా భిన్నంగా మొత్తం జాతీయోత్పత్తిలో తృతీయ రంగపు వాటా ప్రస్తుతం చాలా ఎక్కువగా ఉన్నది. తృతీయరంగపు విస్తరణ రేటు కూడా ద్వితీయ రంగం విస్తరణ రేటుకన్న గణనీయంగా ఎక్కువగా ఉన్నది. ఇటువంటి పరిణామం తలెత్తడం ఒక సూచన, ఒక కారణం కూడ. అది ఆర్థిక వ్యవస్థలో ఆదాయ పంపిణీ వక్రీకరణకు గురయిందనే పరిణామానికి ఒక సూచన. జాతీయాదాయంలో అసాధారణమైనంత ఎక్కువ భాగం సాపేక్షికంగా చాలా తక్కువమంది జనాభా చేతిలో కేంద్రీకృతమై ఉన్నదన్నమాట....ఇది మొత్తంగా అభివృద్ధి వక్రీకరించబడడానికి కారణమవుతుంది" అన్నారు.

తర్వాత గడిచిన రెండు దశాబ్దాలు ఈ విశ్లేషణను ఇంకా అర్థవంతం చేశాయి. అశోక్ మిత్రా విశ్లేషణపై ఆధారపడి. "ఒక సమాజం కూడు, గూడు, గుడ్డ వంటి మౌలిక సమస్యలు పరిష్కరించుకున్న తర్వాత, వస్తూత్పత్తి కన్న వేగంగా సేవారంగాన్ని అభివృద్ధి చేయడం ఆశించదగిందే కావచ్చు. కాని అసంఖ్యాక ప్రజలు ఆకలి బారిన పడే మన దేశం వంటి వెనుకబడిన ఆర్థిక వ్యవస్థలలో సేవారంగం పెరుగుదల నిజంగా ఒక అనారోగ్యసూచికే" అని 1980లో నిర్మల్ కుమార్ చంద్ర విశ్లేషించారు.

సేవారంగ పెరుగుదలకూ, ఆర్థిక వ్యవస్థలో నల్లబజారుకూ, అక్రమార్జనకు ఎంత సంబంధం ఉన్నదో విశ్లేషించిన అరుణ్‌కుమార్, 1990 దశకం గణాంకాలను వినియోగించుకుని, దేశంలో మొత్తం నల్లధనంలో సగానికన్నఎక్కువ సేవారంగంలోనే ఉన్నదనీ విశ్లేషించారు.

ఈ వాదనలకు అర్థం సేవలు అవసరమనో, సేవారంగం అనవసరమనో కాదు. తప్పనిసరిగా మానవ జీవితంలో, ఆర్థిక వ్యవస్థలో సేవారంగపు ప్రాధాన్యత ఉంది. కాని ప్రాథమిక, ద్వితీయ రంగాలతో సంబంధం లేకుండా, సమన్వయం లేకుండా ఆర్థిక వ్యవస్థలో ఒకే ఒక్క రంగం ఉన్నట్టుగా తృతీయరంగానికి పెద్దపీట వేయడం సమంజసం కాదు. తృతీయ రంగానికి ఇవాళ దొరుకుతున్న ఈ ప్రాధాన్యం ఇక్కడి ప్రజల అవసరాల మీద ఆధారపడినది కాదు. మన ఆర్థిక వ్యవస్థ మంచి చెడుల మీద ఆధారపడింది కాదు. కేవలం ఏ సేవలలో బహుళజాతి సంస్థలకు ప్రాబల్యం ఉన్నదో ఆ సేవలు మాత్రమే పెరుగుతున్నాయి.

నిజంగా ప్రజలకు అవసరమైన సేవలు-విద్య, ఆరోగ్యం, ప్రజా రవాణా వ్యవస్థ, ఇవాళ పెరగడం లేదు. బ్యాంకింగ్, ఇన్సూరెన్స్, టెలి కమ్యూనికేషన్స్, విమానయానం, సరుకుల రవాణా వంటి విదేశీ, స్వదేశీ ప్రైవేటు గుత్తాధిపత్యం ఉన్న సేవల రంగం, లేదా ఏ సేవలకు అవసరమైన యంత్ర పరికరాల పరిశ్రమలు బహుళజాతి సంస్థల చేతుల్లో ఉన్నాయో ఆ సేవలు విస్తరిస్తున్నాయి. గత పది సంవత్సరాలలో మరీ ముఖ్యంగా భారత ఆర్థిక వ్యవస్థలోని సేవారంగాలలో జరిగిన మార్పులు చూస్తే, ఆయారంగాలను ప్రైవేటీకరించడం, బహుళజాతి సంస్థల ప్రవేశానికి వీలు కల్పించడం చూస్తే, ఆ సేవల వినియోగ దారుల ప్రయోజనాలు కన్నా ఎక్కువగా అమ్మకందార్ల ప్రయోజనాల పరిరక్షణ జరుగుతోందని అర్థమవుతుంది.

## సేవారంగం - ఆంధ్రప్రదేశ్ - విజన్ 2020 :

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థలో కూడా, భారత ఆర్థిక వ్యవస్థలో లాగానే, సేవారంగం విస్తృతంగా పెరిగిపోతోంది. రాష్ట్ర స్థూల ఉత్పత్తిలో సేవారంగం వాటా 1960-61 లో 29.1 శాతం ఉండగా, 1998-99 నాటికి అది 44.75 శాతానికి పెరిగింది. రాష్ట్రాన్ని సేవా ఆర్థిక వ్యవస్థగా మార్చడానికి ఉద్దేశించిన విజన్ 2020 ఏయే సేవారంగాల మీద ఏ

విధంగా కేంద్రీకరించవలసి ఉన్నదో స్పష్టంగానే ప్రకటించింది. రానున్న 20 సంవత్సరాలలో సేవారంగం వాటాను 67 శాతానికి పెంచాలనే లక్ష్యాన్ని కూడ విజన్ 2020 నిర్దేశించింది.

సేవారంగంలో కేంద్రీకరించవలసిన అభివృద్ధి కారకాలలో విజన్ 2020 ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, జ్ఞాన-ఆధారిత సేవలు, పర్యాటక రంగం, నిల్వ, సరఫరా, రవాణాలకు సంబంధించిన లాజిస్టిక్స్ సేవలు, చిన్న తరహా సేవలు, ఆరోగ్యం, విద్య వంటి అంశాలను గుర్తించింది. మొత్తంగానే విజన్ 2020 ప్రైవేటీకరణ తారకమంత్రాన్ని జపించింది గనుక ఆరోగ్యం, విద్యలను ప్రస్తావించడాన్ని ఆ నేపథ్యంలోనే చూడవలసి ఉంటుంది.

నామమాత్రంగా ఆరోగ్య, విద్యలను ప్రస్తావించినప్పటికీ, సత్పరిపాలన గురించి మాట్లాడుతున్నప్పటికీ, ఎపిస్వాన్, ట్విన్స్, ఇసేవ, ఎపివాన్ వంటి చర్యల ద్వారా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సేవారంగాన్ని ప్రైవేటీకరిస్తుందని, ప్రభుత్వాధీనంలో ఉంచవలసివస్తే లాభనష్టాల లెక్కలలోకి మార్చి, ఆ సేవల సామాజిక శ్రేయోరాజ్యలక్ష్యాన్ని ధ్వంసం చేస్తుందని, యూజర్ ఛార్జీల వసూలు పేరుతో అంతిమంగా అన్ని సేవలను ప్రభుత్వరంగం నుంచి దూరమయ్యేలా చేస్తుందని అర్థమవుతుంది.

## సేవారంగ ప్రాధాన్యత - ప్రభావితాలు - దుష్ఫలితాలు :

ఆర్థిక వ్యవస్థలో సేవారంగానికి అవసరమైనదానికన్న ఎక్కువ ప్రాధాన్యత దొరకడం, పాలకులు సేవారంగ ప్రాధాన్యతతో దేశాభివృద్ధి, రాష్ట్రాభివృద్ధి జరుగుతుందని సేవలు అందుకోవాలని అత్యల్ప సంఖ్యాక వర్గమొకటి అర్రులు చాచడం - వంటి పరిణామాలన్నీ కలిసి మొత్తంగా సమాజం మీద ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక రంగాల మీద ప్రగాఢమైన ప్రభావాన్ని వేస్తాయి. ఆ ప్రభావం తక్షణ, స్వల్ప కాలిక దుష్ఫలితాలకు మాత్రమే కాక దీర్ఘకాలిక దుష్ఫలితాలకు కూడా దారి తీస్తుంది.

సేవారంగం మీద సామ్రాజ్యవాద ప్రపంచీకరణ డేగకన్ను పడడంతో దేశ ఆర్థిక వ్యవస్థలో కొనసాగుతున్న ఆదాయ పంపిణీ మరింతగా ఒడిదుడుకులకు లోనవుతుంది. మామూలుగానే మన ఆర్థిక వ్యవస్థలో, ఆదాయ పంపిణీలో తీవ్రమైన, అసమానతలు, అఖాతాలు ఉండగా, సేవారంగ ప్రపంచీకరణ వల్ల ఆ అసమానత ఇంకా విస్తరిస్తుంది. ఆర్థిక వ్యవస్థలోని ముఖ్య భాగాలైన ద్రవ్య, బ్యాంకింగ్ రంగాలలో బహుళజాతి సంస్థల ప్రవేశంతో, గాట్స్ షరతుల అమలుతో ప్రభుత్వం ఆ రంగాల నుంచి ఉపసంహరించుకోవలసి వస్తుంది. అంటే ఇంతవరకు ఎంతో కొంత అమలయిన ప్రాధాన్యరంగాల పరపతి సౌకర్య పథకాలు రద్దయిపోతాయి. తగ్గిపోతాయి. ఉన్న ప్రభుత్వ రంగ బ్యాంకులను మొండి బాకీలతో నిర్వీర్యం చేసి క్రొత్త ప్రైవేటు బ్యాంకులు, విదేశీ బ్యాంకులు పెరిగిపోయే ఉద్దేశపూర్వక కుట్ర కొనసాగుతుంది. ద్రవ్యరంగంలోకి ఎగిరిపోయే పెట్టుబడి, కాలు నిలవని పెట్టుబడి, జూదగృహాల పెట్టుబడి ప్రవేశించి ఆర్థిక వ్యవస్థను అస్థిరం చేస్తుంది. అతలాకుతలం చేస్తుంది. మొత్తంగా ద్రవ్యరంగంలోని ఈ సేవా సంస్థల స్వభావం వల్లనే లెక్కలేనన్ని కుంభకోణాలు జరిగి విలువైన ప్రజాధనం దుర్వినియోగమై పోతుంది.

సేవారంగం పెరుగుదల నల్లధనం పెరుగుదలకు దారితీసి ఆ లెక్కలేని డబ్బు రాజకీయాలలోకి ప్రవేశిస్తుంది. ఈ డబ్బుకు ఏ స్థాయిలోనూ ఉత్పత్తితో సంబంధం లేదు గనుక కనీస క్రమశిక్షణ కూడా ఉండదు. ఈ డబ్బుతో పెంచిపోషించబడే రాజకీయాలు కూడా అరాచక, మాఫియా రాజకీయాలుగానే ఉంటాయి తప్ప ప్రజాసేవ కోసం, సామాజిక అవసరాలకోసం సాగే రాజకీయాలుగా ఉండవు. సాధారణంగా సేవారంగ పెట్టుబడి ఉత్పాదక రంగంలోని పెట్టుబడి లాగ నియమాలకు లోబడి కాక లంపెన్ లక్షణాలతో ఉంటుంది. ఆ పెట్టుబడి పోషణలో రాజకీయాలను కూడా ఆ స్వభావమే వస్తుంది. రాజకీయాలలో రియల్ ఎస్టేట్స్, ఫైనాన్స్, ట్రాన్స్ పోర్ట్, హోటళ్ళు, వినోద పరిశ్రమల నుంచి వచ్చిన డబ్బు ప్రాబల్యం పెరిగిన కొద్దీ రాజకీయాలలో దిగజారుడు ఎక్కువ అయిపోతుండడం అందరికీ తెలిసిన విషయమే.

సేవారంగంలో ప్రైవేటీకరణ పెరిగిన కొద్దీ ప్రభుత్వ నిర్వహణలో ఉండవలసిన సేవారంగాలయిన విద్య, వైద్యం, ఆరోగ్యం వంటి వాటిపై వ్యయాన్ని తగ్గించడం మొదలవుతుంది. బడ్జెట్‌లోటు తగ్గింపు పేరుతో ఈ పని జరుగుతోంది. మరోవైపు ప్రభుత్వ సేవలలోనే భాగమైన రక్షణ, పోలీసు శాఖల వ్యయం పెరిగిపోతూ ఉంటుంది. అంటే సామాజిక అర్థంలో సంక్షేమ రాజ్యం రద్దయిపోతూ పోలీసు రాజ్యం పెరిగిపోతుంది. ఈ పరిణామం ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాల మీద కూడా ప్రభావం చూపిస్తూ ఉంటుంది.

సేవారంగం ప్రాధాన్యత వల్ల అన్నిటికన్నా పెద్ద ప్రమాదం సాంస్కృతిక విలువల మార్పులో జరుగుతుంది. వ్యవసాయోత్పత్తి, పారిశ్రామికోత్పత్తి పెరుగుతూనే ఉన్నప్పటికీ, జాతీయాదాయంలో వాటి వాటా తగ్గిపోయి, సేవారంగం వాటా పెరగడమంటే సాపేక్షికంగా వ్యవసాయ, పారిశ్రామికోత్పత్తుల వాటా తగ్గడమనే అర్థం. అంటే కనబడే ఉత్పత్తి విలువ తగ్గిపోయి, కనబడని "సేవ" అనబడే దాని విలువ పెరుగుతుందని అర్థం. ఇది శ్రమ గౌరవం తగ్గిపోవడానికి, శ్రమను చిన్నచూపు చూసి, సేవారంగాన్ని గౌరవించడానికి దారితీస్తుంది. మరో మాటలో చెప్పాలంటే శారీరక శ్రమకు, మానసిక శ్రమకు ఇప్పటికే ఉన్న అంతరాన్ని ఈ పరిణామం మరింత లోతుగా, మరింత విశాలంగా మార్చివేస్తుంది.

మరోవైపు సేవారంగంలోని పర్యాటక పరిశ్రమ, లీజర్ పరిశ్రమ పేరుతో సాగే హోటళ్ళు, రెస్టారెంట్లు, వినోద, విలాస సాధనాలు ఇబ్బడి ముబ్బడిగా పెరిగిపోయి, సమాజ సంస్కృతిలో ఉన్న మానవీయ విలువలన్నిటినీ ధ్వంసం చేస్తాయి. ఈ సేవారంగం పెరుగుదల వల్ల వ్యభిచారం, వికృత కామకలాపాలు, భోగలాలస పెరగడం వంటి సాంస్కృతిక రంగ దుష్పరిణామాలు ఎన్నో ఆసియన్, లాటిన్ అమెరికన్ దేశాల అనుభవంలో ఉన్నాయి. (మిగతా 21వ పేజీలో)

# నదుల అనుసంధానం ఓ పెనుముప్పు వంటకం

- శైలేంద్రనాథ్ ఘోష్

**భారతదేశంలోని** నదులనన్నింటినీ అనుసంధానం చేయాలనే కేంద్ర ప్రభుత్వ నిర్ణయం, ఆ పని వేగంగా చెయ్యాలని సుప్రీంకోర్టు తీర్పు - రెండూ లోపభూయిష్టమైనవే. అనుసంధానించటంలో పర్యావరణ సంబంధమైన విషయాలగురించి, ఆర్థికంగా, సామాజిక సమస్యల గురించిన అవగాహనా రాహిత్యాన్ని పై నిర్ణయం ప్రతిబింబిస్తుంది. అలాంటి అనుసంధానాన్ని ఇంకా తక్కువ ఖర్చులో సాధించగలమనే ఆలోచనే వున్నట్లు తోచదు. సర్ ఆర్థర్ కాటన్‌కు అలాంటి ఆలోచన వచ్చిందంటే తీరప్రాంత జల రవాణా కలుగజేయాలనే తలంపే మూలం, అలాగే కె.ఎల్.రావు పంట పొలాలకు నీరు, విద్యుదుత్పత్తి సాధన లక్ష్యంగా పెట్టుకొని ఆ ప్రతిపాదన చేశారు. కాని వాటికన్నా ముఖ్యమైన విషయాలు మరికొన్ని వున్నాయి. ఈనాటి రాజకీయ వేత్తలకు ఇంకా ఎక్కువ నీరు ఎలా పారించుకోవాలనేదే గాని, నీటి ప్రవాహం భూసార రక్షణ మీద ప్రభావమేమిటి, రైతుల అవసరం ఎంత, ఏ పంటకు ఎంత నీరిస్తే సరిపోతోంది, నదుల అనుసంధాం చేసిన తర్వాత నీటివాడకం విషయంలో వివిధ ప్రాంతాల మధ్య తలెత్తే వివాదాలు - ఇలాంటివేమీ వారి ఆలోచనలోకి రాలేదు. పెద్దకమతాలు గల జమీందార్ల, రైతుల ప్రయోజనాలు నెరవేరితే చాలుననేదే వారి ఆలోచన. అనుసంధాన ప్రక్రియ ఎత్తయిన ప్రాంతాలనుంచి కాలుష్యాన్ని కింది ప్రాంతాలకు రవాణా చేస్తుందని, మంచి నీటిని కూడా కలుషితం చేస్తుందని వారు అర్థం చేసుకోవటంలేదు. నీళ్లు పారుతున్నాయి కదా అని అతిగా నీరు వాడితే మెసపొటేమియాలో భూలో భూములన్నీ చవుడు బారిపోయాయయనే విషయం మరిచారు. ప్రస్తుతం పాకిస్తాన్‌లో వున్న లయాల్‌పూర్, మాంట్‌గోమరి, సర్గోడా జిల్లాలు ఒకపుడు నీటిపారుదలతో కూడిన వ్యవసాయానికి ప్రతీకలు. ఇపుడో ఉప్పు భూములుగా మారిపోయాయన్న విషయం వారికి తెలియకపోవచ్చు.

పర్యావరణానికి ముప్పుతెచ్చిపెట్టే ప్రధాన సమస్యలని ప్రక్కదారి పట్టించడం మనదేశ ఆనవాయితీగా మారింది. కొన్ని ప్రాథమిక విషయాలు మనం విస్మరించకూడదు. ప్రతి నది అది పుట్టిన ప్రాంతం నుండి, అది ప్రవహించే పరీవాహక ప్రాంతంనుండి, మొత్తంగా ఆ నది బేసిన్ నుండి కొన్ని ప్రత్యేక లక్షణాలను సంతరించుకుంటుంది. ఏనదికానదే కొన్ని ప్రత్యేక లక్షణాలు కలిగి ఉంటుంది. ప్రతినదిలోని నీటి నయనం కేవలం దాని హార్డ్‌నెస్, సాఫ్టెనెస్ అనే ఒక్క గుణాన్ని బట్టీ చూస్తే చాలదు. నీటిలో ఉండే విభిన్న లవణాలు, ఎయిరేషన్ విస్తృతి విద్యుత్-రసాయనిక గుణాలు, స్వాస్థతా లక్షణాలు మూలంగా ఒక్కోనది తనకంటూ ఓ ప్రత్యేకత కలిగి ఉంటుంది. ఇటువంటి ప్రత్యేకతపై ఆధారపడే ఆ నదుల్లో జీవరాసుల పుట్టుక - మనుగడ కొనసాగుతాయి. నీటిపైభాగాన తేలియాడే క్రిమి-కీటకాలు, వాటి ఆధారంగా నివసిస్తూ తిరుగాడే రకరకాల పక్షులు, వాటి మనుగడ ఆధారపడి ఉంటుంది. ప్రతి నది యొక్క నిజమయిన విలువ ఎంత అన్నది లెక్కకట్టలేనిది. ప్రాణి సముదాయానికి, ముఖ్యంగా మానవ జీవనానికి దోహదపడే ప్రతీనది అంతర్భాగ, బాహ్యాభాగంలో జీవించే జీవరాసుల విలువపై ఏ రకమయిన ప్రత్యేక విశ్లేషణ జరగలేదు. అమెరికాలోని టెల్లీలో అనే పెద్ద ఆనకట్ట నిర్మాణం ఎంతో ఖర్చుచేసి ముగింపు దశకు తీసుకువచ్చిన సమయంలో కోర్టులు దాన్ని నిలిపివేయాలని తీర్పునిచ్చాయి. ఎందుకంటే అరుదయిన చిన్ని-చిన్ని డార్ట్ చేపలు కేవలం ఆ నదిలోనే లభ్యమౌతాయని గుర్తించడం మూలంగా వాటిని రక్షించడానికి తీర్పు ఇవ్వడం జరిగింది. అందుచేత నదుల అనుసంధానం వల్ల ఇటువంటి ఎన్నో జీవరాసులు అంతరించిపోయే ప్రమాదం ఉంది. ఇది పూడ్చుకోలేని నష్టం.

"గంగానది నుండి నీటిని మళ్ళించే అవకాశం ఒక్క పాట్నా పట్టణం వద్దనే వుంది. ఆ చోటు సముద్ర మట్టానికి 200 అడుగుల ఎత్తులో ఉంది. దీనిని ఏ ఇతర నదితోనైనా లింక్ చెయ్యాలంటే అక్కడి నీటిని వింధ్య పర్వతశ్రేణిపైకి అంటే సముద్రమట్టనికి 2860 అడుగుల పైకి పంప్ చేయాల్సి ఉంటుంది. 20,000 క్యూసెక్కుల నీటిని అంత ఎత్తుకు పంప్ చెయ్యాలంటే ఆనాటికి దేశంలో ఒక్కరోజు ఉత్పత్తయ్యే మొత్తం విద్యుచ్ఛక్తి అంతా ఖర్చుచెయ్యాలని తేలింది. ఈ పథకానికయ్యే ఖర్చు కనీసం ఆనాటికి 2,00,000 కోట్లు ఉంటుంది. ఇటువంటి భారీ మొత్తాన్ని సమకూర్చడానికి ఏ ఆర్థిక మదుపు సంస్థలూ ముందుకు రావు. ఒకవేళ నిజంగానే సాధ్యపడినా ఇటువంటి పనికి తూర్పు బీహార్, పశ్చిమ బెంగాల్‌నుండి ప్రజా తిరుగుబాట్లు చవిచూడవలసి వస్తుంది. మనతో గంగానదీ జలాల పంపిణీ ఒప్పందాన్ని కుదుర్చుకున్న బంగ్లాదేశ్ ఈ విషయంపై పెద్ద దుమారం లేవదీసి సమస్యని అంతర్జాతీయం చేసేది. బ్రహ్మపుత్ర నుండి వచ్చే మిగులు జలాలవల్ల 'గంగ' లబ్ధిపొందే అవకాశం లేదు. ఎందుకంటే బంగ్లాదేశ్ తన భూభాగం గుండా ఈ రెండు నదుల లింక్ కెనాల్ తవ్వడానికి అంగీకరించదు. ఇంత విపరీతమయిన ఖర్చుతో కూడుకొని ఉన్నప్పటికీ దేశం ఈ అనుసంధానం కార్యక్రమాన్ని చేబడుతుందని కాసేపు ఊహించుకుందాం. అదే జరిగితే

నదీ తీర ప్రాంతాలనుండి విస్తృత జన సమూహాలను ఖాళీ చేయించటం వల్ల జరిగే నష్టం చాలా దారుణంగా ఉంటుంది.

ప్రముఖ జర్నలిస్టు సి. రామ్మోహన్‌రెడ్డి మాటల్లో చెప్పాలంటే : "వేల కిలోమీటర్ల కాలువల తవ్వకాలు, బేరేజీలు, కట్టడాలు పెద్ద సంఖ్యలో గ్రామాలను కనుమరుగు చేస్తాయి. అనేక పట్టణాలు మునిగిపోతాయి. ఎన్నో లక్షల ఎకరాల సాగుభూమిని దిగమింగుతూ ఈ పనులు జరుగుతాయి. లక్షలాది ప్రజలు తమ ఆవాసాలనుండి పెకలించి వేయబడతారు. ఈ సంఖ్య దేశవిభజన నాడు చెల్లాచెదురై పోయిన జనాభా సంఖ్యను మించిపోతుంది".

మనదేశంలో నీరు అతిగా వాడటం వల్ల పంటభూములు ఉప్పుతేలిపోవడం అన్నది భాక్రా కాలువతీరప్రాంతంలోనూ ఉత్తర ప్రదేశ్‌లోని సర్దార్ సహాయక కాలువ తీరప్రాంతంలోను గోచరిస్తోంది. (ఈ విషయాలన్నీ డా॥ జస్టిస్ కిర్‌పాల్ గారు సర్దార్ సరోవర్ డామ్ విషయంలో ఇచ్చిన తీర్పులో విస్మరించారు) ప్రపంచమొత్తంగా నీటి పారుదలతో సాగయ్యే దాదాపు సగభాగం భూములు ఉప్పు వాత పడ్డట్టు కొన్ని సంవత్సరాల క్రితం వేసిన అంచనా.

మన కళ్ళముందే భారతదేశంలోని పంటభూములు ఉప్పు భూములుగా పరివర్తన చెందడం త్వరితంగా జరిగిపోతోంది. ఇటువంటి వినాశనానికి రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు వత్తాసు పలుకుతున్నాయి. కొన్ని పంటలు ఆయా ప్రాంతాలకు అనువయినవైనా, లాభాల నార్జించి పెడతాయి కాబట్టి వాటికది అనుమతించటం రెండో లక్ష్యం.

పటాటోప కార్యక్రమాల్లో మునిగి దివాళాతీసేకన్నా మనకు ఇప్పటికే ఒనకూడి ఉన్న, సర్వదా మేలయిన నీటి సేకరణకి అనువయిన కట్టడాలను, వనరులను వ్యవసాయానికి అనువుగా ఉపయోగించుకునే మార్గాలు అన్వేషించాలి. ఇవి పర్యావరణ పరిరక్షణకు ఎంతగానో దోహద పడతాయి కూడా. కర్నాటకలో రైతులు పట్టించుకోని మూలంగా పూడుకుపోయి నిరుపయోగమైపోయిన 11,000 సాంప్రదాయక చెరువులు, కుంటలు ఉన్నాయి. ఇవన్నీ ప్రజలు ఒకప్పుడు బాగా ఉపయోగించు కున్నవే. ప్రపంచంలోని శాస్త్ర ప్రముఖులను ఆశ్చర్య చకితులను చేసిన, నీటి విజయాలు సాధించిన 'ఈరీస్' తమిళనాట విస్తారంగా ఉన్నాయి. అవన్నీ ఈరోజు నిరాదరణకు గురై ఉన్నాయి. అంతేగాక ఇక్కడ విలువయిన నదులనుండి విపరీతంగా ఇసుక తవ్వి తరలించడం ద్వారా ఆ నదుల శక్తి నిర్వీర్యం చేస్తున్నారు. తమిళనాడు విలువైన తన సొంత నీటి వనరులను ఎంత దారుణంగా నిరాదరణకు గురి చేసుకుందో చెప్పాలంటే చెన్నైలోని 'కూమ్'నది ఏ రకంగా మురుగునీటి నాలాగా మారిపోయిందో చూస్తే చాలు.

తమిళనాడయినా, కర్నాటక అయినా, కచ్ ప్రాంతమయినా నీటి కోసం పెద్ద పెద్ద కట్టడాలు అవసరం లేదు. ప్రఖ్యాత వాతావరణ శాస్త్రవేత్త డా॥ పిషరోటి (ఈయన రెండు నెలల క్రితమే మరణించారు) ఏమన్నారంటే " ఏ ప్రాంతంలోనైనా 50 సెం.మీ. వర్షపాతం ఉన్నట్లయితే సరైన వర్షపునీటి సేకరణ పద్ధతులద్వారా ఆ ప్రాంతపు నీటి అవసరాలను తీర్చవచ్చు.

పైన ఉదహరించిన పర్యావరణ, ఆర్థిక, సామాజిక మానవీయ సంబంధిత అంశాలనన్నింటినీ మనసులో పెట్టుకుని ప్రభుత్వానికి తుగ్లకీయ నదీ అనుసంధాన కార్యక్రమాన్ని విరమించుకోమని సలహా చెప్పవలసి ఉంది. అంతేగాక మన గౌరవనీయ ఉన్నత న్యాయస్థానం ఇచ్చిన తీర్పును తిరిగి ఓసారి దేశక్షేమంకోసం తప్పక పరిశీలించాల్సి ఉందని కూడా చెప్పుకోవాలి.

**ముగింపు :** ఈ వ్యాసం రాసాక నవంబర్ 20న ప్రధానమంత్రి అన్ని మహనదులను కలిపే ప్రణాళికకు ప్రభుత్వం కట్టుబడి ఉందని, తద్వారా దేశంలో అనావృష్టి పరిస్థితులను అధిగమించవచ్చని ప్రకటించారు. ఈ ప్రకటనకు అన్ని రాజకీయ ప్రముఖులు, పార్లమెంట్ సభ్యులు వత్తాసు పలికారు. హర్షం వెలిబుచ్చారు. ప్రధాని, ఆయన మంత్రివర్గము ఈ క్రింది ప్రశ్నలకు జవాబు చెప్పవలసి ఉంది.

- ❑ ఈ దేశంలో అత్యంత కరువుకు గురౌతున్న రాజస్థాన్, గుజరాత్ లోని కచ్, సౌరాష్ట్ర ఆంధ్రప్రదేశ్‌లోని రాయలసీమ, ఒరిస్సాలోని కలహండి, నౌపారా, మొదలయిన ప్రదేశాలకు నదీ అనుసంధానం వల్ల మేలు జరుగుతుందా?
- ❑ ఇప్పుడు ప్రబలంగా ముందుకొస్తున్న ఈ నదీ అనుసంధానపు కోరిక పైన చెప్పిన ప్రాంతాల ప్రజలనుండి కాక నిరంతరం తక్కువగా నీరు అవసరమయ్యే పంటలనే పండిస్తున్న ఆంధ్ర, కర్నాటక, తమిళనాడులలోని ధనిక రైతు వర్గాలనుండే ఎందుకు వస్తోంది?
- ❑ మన అనుభవంలోనికి వచ్చిన ఈ మధ్యకాలం నాటి నీటి పొదుపు - సేకరణ - నిర్వహణ పద్ధతులద్వారా ప్రజల అవసరాలు తీర్చలేమా?

నదీ అనుసంధానంవల్ల కలిగే పర్యావరణ కాలుష్యముప్పు, ప్రాంతీయ స్పర్థలు, నీటి పటుత్వానికి, నాణ్యతకు కలిగే అపకారం, దివాళా దిశగా తీసుకువెళ్ళే ఎక్కువ ఖర్చువల్ల అవగాహనారాహిత్యమే ప్రధాని ప్రకటనకు జేజేలు పలకడానికి పలు కారణాలు.

వికేంద్రీకరణతోనూ, తక్కువ వ్యయంతోను కూడుకున్న నీటి సేకరణ - నిర్వహణ - వినిమయ - పద్ధతులను గాలికి వదిలివేయడమే అనుసందాన కార్యక్రమమంతా. నీరు ఆవిరైపోయి వృధాకాకుండా భూగర్భంలో నిలువచేయగల సత్తా ఉన్న "పెర్కొలేషన్ టాంక్"ల పునర్జీవన ప్రక్రియను సరిగా చేపట్టినట్లయితే ఒనగూరే ప్రయోజనాల తిరస్కారమే ఈ అనుసంధాన కార్యక్రమం. ఇప్పటివరకు ప్రభుత్వాలు చెప్పుకుంటూ వస్తున్న సర్వవిధ నీటి వనరుల సంరక్షణ అనే నినాదాలన్నీ బూటకమే నన్నమాట. నదీ అనుసంధాన ప్రణాళికా రచనంతా విస్తృత కమతాలు గల ధనికరైతు లాబీల ధనదాహం తీర్చడానికి చేసిందేగాని వేరేమీ కాదు. ప్రకృతికి, విస్తృత ప్రజానీకానికి ఎంతటి ముప్పు తెచ్చి పెట్టేదయినా సరే వెనుకాడని మనస్తత్వంతో కూడుకున్నది ఈ వ్యవహారమంతా.

# పోటీ - సహకారం

- డి. పాపారావు

**నేటిది** పోటీ ప్రపంచం. మార్కెట్ల కోసం సామ్రాజ్యవాదుల పోటీ. పెట్టుబడులను ఆకర్షించడంకోసం బడుగుదేశాల పోటీ. ఉద్యోగాల వేటలో నిరుద్యోగుల పోటీ. దీనంతటి సారం ఏమిటి? మానవుడు స్వార్థజీవి కావడమేనంటారు కొందరు. స్వీయ ప్రయోజనాలే ఎవరికైనా అంతిమ పరమార్థమని చెబుతుంటారు వీరు. ఈ స్వీయ ప్రయోజనాలకు తాత్వికముసుగు వేసి విస్తృత ప్రచారంలో పెట్టినవారు ఉన్నారు. దీనికి చక్కటి నిదర్శనమే ఆయన్‌రాండ్ వంటివారి వస్తుగత వాదం.

ఆ మధ్య నేనొక హిప్నాటిస్ట్‌ని కలిశాను. మాటల మధ్యలో ఆయన నీ జీవిత లక్ష్యమేమిటని ప్రశ్నించారు? అందరికీ మేలు జరిగే మంచి సమాజం ఏర్పడడమే నా కోరిక అని చెప్పాను. కాగా, ఆ హిప్నాటిస్ట్, నేను ఇప్పటివరకు వేలాదిమందిని హిప్నటైజ్ చేశాను. వారి అంతఃచేతనలోకి తొంగి చూడగలిగాను అన్నారు. దీనంతటి నుండి మనిషి ఏ వర్గానికి చెందినవాడైనా, అతనిలో నిక్షిప్తంగా ఉన్న ప్రధాన లక్షణం స్వార్థమేనని ఆయన సెలవిచ్చారు. దానికి నేనిచ్చిన జవాబు ఇది: మీరు చెప్పినది నిజమే అనుకుందాము. సామాజికరంగం స్వార్థ పరుల మధ్య పోటీయే అనుకుందాము. అయితే ఇంతమంది స్వార్థ పరులు పోటీపడుతున్నప్పుడు, వీరిలో అందరి స్వార్థం నెరవేరే అవకాశం ఎంతవరకు ఉంది? మనం ప్రస్తుత సమాజాన్ని చూస్తే హెచ్చు శాతం మంది సోకాల్డ్ స్వార్థపరులు బాధలలోనే బతుకుతున్నారు. అంటే ఈ సంకుచిత స్వార్థ ప్రయోజనాల పోటీ లోకంలో, అందరి స్వార్థం నెరవేరడం లేదు. అంతకు మించి నెరవేరే అవకాశం కూడా లేదు. కాబట్టి ఈ ప్రయోజనాల పోటీలో కడకు ఓడిపోయినవారు ఎప్పటికైనా నిరాశకు లోనవ్వక తప్పదు. సమాజంలో అత్యధికులు ఉన్న ఇటువంటి వారికి అప్పుడు ప్రత్యామ్నాయం ఏమిటని నేను ప్రశ్నించాను. ఈ ప్రశ్నకు ఆయన వద్దేకాదు, స్వార్థమే మానవనైజం అని నమ్మిన ఎవరి వద్దా జవాబు ఉండదు.

పాశ్చాత్యదేశాల మేనేజిమెంట్ సిద్ధాంతాలు నేటివరకు మానవుడి పోటీ స్వభావాన్ని, అతని స్వార్థాన్ని సామాజిక సిద్ధాంతాలుగా ముందుకు తెచ్చాయి. ఇప్పుడిప్పుడే ఈ ధోరణిలో ఇసుమంత మార్పులు కనబడు తున్నాయి. అయితే మొత్తం మీద పైన పేర్కొన్న ధోరణి నేటికి పెట్టుబడిదారీ ప్రపంచపు తాత్వికతగా ఉంది. కాగాపోగా, ఈ పాక్షిక సత్యాన్ని సార్వజనీనంగా పేర్కొంటూ రావడం, మానవ సామాజిక జీవితంలోని ఒక ముఖ్య అంశాన్ని విస్మరిస్తూ వచ్చింది. నాటి అమెరికా

---

హిమాలయా సానువలనుండి నీటినిపొందే నదులన్నీ త్వరిత గతిన పూడికకు గురౌతున్నాయి. ఇది మన ప్రధాన సమస్య. దీనివల్ల నదుల గర్భాలు పూడుకుపోయి వాటి లెవెల్స్‌పైకి పెరగడం ద్వారా అవి తగినంతగా నీటిని ప్రవహించనివ్వటం లేదు. అందుమూలంగా సముద్రంలోకి పోతున్న నీటి వృధా శాతం ఎక్కువగా ఉంటుంది. వర్షాకాలం వరదలకు, ఇతర కాలాల్లో నీటి ఎద్దడికి ప్రజలు గురౌ తున్నారు.

నదులలో పూడికలను తీసివెయ్యడం, కాలువలన్నిటినీ లోతుగా త్రవ్వడం, హిమాలయ పర్వతసానువులను పచ్చబర్చడానికి వృక్షాలను నాటడం, నదులకు ఇరువైపుల అవి బయల్దేరిన ప్రదేశాలనుండి వాటి డెల్టాలవరకు ఒడ్డులవెంబడి చెట్లు నాటడం, ఈ కార్యక్రమాన్ని వెనువెంటనే చేపట్టాలి. నదీ అనుసంధాన ప్రణాళిక అంటే పైన చెప్పినవాటిని ప్రక్కదారి పట్టించడమే.

ఈ తతంగమంతా ప్రభుత్వం తను ఈ క్రింది ప్రాథమిక కర్తవ్యాల నుండి పూర్తిగ తొలగిపోవాలని చూస్తున్నట్లు కన్పిస్తోంది. (1) ఏయే వాతావరణ పరిస్థితులకు ఏయే ప్రాంతాలలో సానుకూలమైన పంటలు వెయ్యాలి? (2) జనాభా యొక్క పౌష్టికాహార తదితర ఆహార సంబంధిత అంతర్ పంటలు వెయ్యాలి? (3) అటువంటి పంటల కార్యక్రమానికి ఎన్నుకోవలసిన అనుసరించవలసిన నీటిపారుదల, డ్రైనేజీ పద్ధతుల ఎంపిక ఎటువంటిదై వుండాలి? అనే విషయాల ఎడల ప్రజలను గైడ్ చెయ్యాలి.

ఇంకొక ముఖ్య విషయం ఏమంటే, ఈనాడు పరిశ్రమలనుండి, పెద్ద పెద్ద ఎస్టేట్‌లనుండి శుభ్రపరచకుండా వదిలివేస్తున్న వ్యర్థ పదార్థాల మూలంగానే నదులన్నీ విషపూరితాలై ఎన్నో అనర్థాలకు దారి తీస్తున్నాయి. వాటిపై సరైన నియంత్రణ లేకుండాను, వాటిని పూర్తిగా కట్టడి చెయ్యకుండాను, ఏ సంస్థలు పరిశ్రమలు వీటికి కారణ మౌతున్నాయో తిరిగి వాటి ప్రయోజనాలకొరకై మరింత విద్యుత్ ఉత్పాదన, సరఫరా చెయ్యడానికి అనుసంధాన ప్రక్రియను ముందుకు నెట్టడం అన్నది తెలివిమాలిన పనే అవుతుంది.

(మెయిన్‌స్ట్రీమ్ పత్రిక సౌజన్యంతో)

సంక్షిప్త స్వేచ్ఛానువాదం : భూపతిరాజు సాంబశివరాజు ❒

అధ్యక్షుడు రీగన్ సోవియట్ యూనియన్‌లోని గత వ్యవస్థను "దెయ్యాల రాజ్యం"గా అంటే మానవనైజానికి సరిపడనిదిగా అభివర్ణించడం కొందరికైనా గుర్తుండే ఉంటుంది.

నేను పైన పేర్కొన్నట్లు మానవనైజానికి సంబంధించిన చర్చలో పూసలదండలో అంతర్లీనంగా ఉన్న దారం వంటి ఒక ప్రధాన అంశం బహుశ ఉద్దేశపూర్వకంగానే "విస్మరించబడుతూ" వచ్చింది. పారిశ్రామికాభివృద్ధి ఆరంభమై, కొనసాగిన రెండు, మూడు వందల ఏళ్లపాటు ఈ పోటీవాద దృక్పథం, ఒక చారిత్రక అవసరంగా కొనసాగింది. సంకుచిత పోటీ మనస్తత్వాన్ని పెంచి పోషించకుండా ఈ కాలంలో పెట్టుబడిదారీ వ్యవస్థ తాను సాధించిన విజయాలను, సాధించగలిగి ఉండేది కాదు. కాని మనం వాస్తవ జీవితాన్ని పరిశీలిస్తే ఈ పోటీ దృక్పథాన్ని ఒక సిద్ధాంతంగా పైకెత్తడం కేవలం వాస్తవ జీవితాన్ని తలక్రిందులుగా చూడటమేననేది బోధపడుతుంది. దేశాలు, వ్యక్తులు తమతమ రంగాలలో పరిస్థితులలో ఎంతగా పరస్పరం పోటీపడ్డా, తుదకు ఈ ప్రపంచాన్ని, వ్యక్తులను నిర్మించేది, నడిపించేది, ముందుకు తీసుకుపోయేది సహకారమేనని మనం గమనించవచ్చు. పరస్పర సహకార పునాది లేకుండా ఏ నాగరికతలోనైనా మనుగడ అసాధ్యం. ఇలా సహకరించుకుంటూ దేశాలు, మనుష్యులు ముందుకుపోలేని పరిస్థితులలోనే యుద్ధాలు, హింస వంటి ఉపద్రవాలు సంభవిస్తూ ఉంటాయి. కాబట్టి "సుస్థిర" సాధారణ పరిస్థితుల్లో శ్రమవిభజన పరాకాష్ట అయిన అసెంబ్లీ లైను (కార్ల పరిశ్రమ వంటి వాటిల్లో) మొదలుకొని మార్కెట్లలో "పోటీ"కై సమిష్టి నిర్ణయాలు గైకొనే యాజమాన్యం వరకు మనకు స్పష్టంగా కనపడేది పరస్పర సహకారమే. ఈ సహకార భావనే లేకుంటే కేవలం పోటీయే ప్రధానాంశమైతే అణు యుద్ధంలో ప్రపంచం ఈ పాటికే భస్మీపటలమై ఉండేది. వివిధ వ్యాపార సంస్థలు కుక్కలు చింపిన విస్తర్లు అయ్యేవి. తుదకు సమాజమే మనుగడ లేకుండా పోయేది. కాబట్టి పోటీయే మానవ జీవితపు ప్రధాన స్రవంతి అని చెప్పచూడడం వాస్తవాన్ని మసిబూసి మారేడుకాయ చేయడమే. ఈ తల్లకిందులు సిద్ధాంతాన్ని నిటారుగా నిలబెట్టి చూస్తే మనకు జీవితపు అసలు వాస్తవం బోధపడుతుంది. వాస్తవ జీవిత పూసల దండలో దారంగా ఉన్న సహకారమే మానవ జీవితానికి, మనుగడకు ఆలంబన అని అర్థమవుతుంది. ఈ వాస్తవం వెలుగులో చూస్తే పోటీని, స్వార్థాన్ని ప్రధానాంశాలుగా చేయచూడడం ఎవరికి లాభం? సమాజంలో పరాన్నభుక్కులుగా బ్రతుకుతూ, హెచ్చుశాతం సామాజిక సంపదను తమ జేబులలో నింపుకుంటున్న వారికే ఈ సిద్ధాంతాలు లాభదాయకం. స్వంత ఆస్తి, లాభం లేకుండా ఎవరైనా ఎందుకు కష్టిస్తారు అని పలువురు ప్రశ్నించవచ్చు. అయితే మనం వాస్తవ జీవితాన్ని గమనిస్తే సమాజ సంపదను సృష్టించే అత్యధికులు స్వంత ఆస్తి నామమాత్రంగా ఉన్నవారో లేదా అసలు లేనివారో. మరొక ప్రక్క స్వంత ఆస్తి మానవ జీవితానికి స్ఫూర్తి అని చెప్పే ధనాఢ్యులలో పలువురు సోమరిపోతులే. ప్రపంచంలోని ఏ దేశంలోని క్లబ్బులను చూసినా, బార్లను చూసినా, విలాస పర్యటక కేంద్రాలను చూసినా ఒక్కమాటలో హెచ్చుమంది ధనవంతుల జీవనశైలిని చూసినా మనకు కనపడే నగ్న సత్యం ఇదే. పూటకు గతిలేనివారు నిరంతరం శ్రమించక తప్పదు. సర్వం ఉన్నవారు ఆ శ్రమ ఫలితాన్ని "లీజర్ క్లాస్"గా అనుభవించక "తప్పదు".

దీనంతటి సారం పోటీ మనస్తత్వమనేది ఒక చారిత్రక నేపథ్యంలో కొద్దిమంది సంకుచిత ప్రయోజనాలకై ముందుకు తెచ్చిన అంశం. 5-6వేల సంవత్సరాల క్రితం ప్రపంచంలో ఎక్కడ ఏ రకం దోపిడీ వ్యవస్థా లేదని సామాజిక అధ్యయన వేత్తలు నిర్వివాదంగా రుజువుచేసిన అంశం. నాటి వర్గాలు లేని దోపిడీ లేని ఆదిమ సమాజంలో మానవ సమూహాలలో సహకారం ప్రధాన పాత్ర వహించిందని మనకు ప్రస్ఫుటమవుతుంది. ప్రకృతి శక్తుల నుండి జంతువుల నుండి తమను తాము కాపాడుకోవడంలో ఆదిమ మానవునికి సహకారమే అత్యున్నత విలువ అయితే ప్రకృతి శక్తులపై ఆధిపత్యం పెరిగిన కొద్దీ మానవుడు వెలుపల శక్తులతో పోరాటం నుండి బయటపడ్డాడు. ఈ స్థితిలోనే సమాజంలో దోపిడీ, మనుష్యుల మధ్య పోటీ ప్రధానాంశాలుగా ముందుకు వచ్చాయి. మరొక గమనించవలసిన విషయమేమిటంటే, సహకారం ప్రధానాంశంగా గల ఆదిమ సమాజం చరిత్ర, దోపిడీ వ్యవస్థల చరిత్రకంటే దరిదాపుగా 20 రెట్లు ఎక్కువ. అంటే ఆదిమ సమాజం 90వేల సంవత్సరాల పైబడ్డ చరిత్ర గలది. దీనంతటి సారం పోటీ మనస్తత్వం, సహకారం నాణేనికి బొమ్మ బొరుసు వంటవని. కానీ ఈ రెంటిలో ఆదిమ సమాజం మొదలుకొని నేటివరకు సహకారానిదే ప్రధానపాత్ర అని. (దోపిడీ తాలూకు పోటీలేని ఆదిమ వ్యవస్థలో సైతం మానవులలో సెక్స్‌పరమైన ఆకర్షణలకు సంబంధించిన పోటీ ఉందనేది మనం గమనించాలి.) అందుకే మనం విస్తృత ప్రచారంలో ఉన్న "పోటీ సమాజం" అనే మాట వాడుతున్నప్పటికీ వాస్తవానికి మనం సంఘ జీవులమని, సహకార జీవులమని గుర్తించాలి. అప్పుడే పరస్పర ఆధారిత సమాజంలో మనం సరైన సంబంధాలను నెలకొల్పుకొని ముందడుగు వేయగలం. దీనంతటిని మించి పోటీ ప్రపంచ భావనను ప్రచారంలో ఉంచడం పెట్టుబడిదారీ వర్గ ప్రయోజనాల దృష్ట్యా తప్పనిసరి. పెట్టుబడిదారీ వ్యవస్థలో సమాజంలోని యావన్మందికి ఉపాధి అవకాశాలు ఉండవు. మించి ఈ సమాజం అలా అవకాశాలను ఉండనీయదు. సమాజంలో నిరుద్యోగుల శాతం ఒక స్థాయికి మించి పడిపోతే అది పెట్టుబడిదారులకు చుక్కెదురు. ఎందుకంటే సమాజంలోని మనుష్యుల మధ్య నిరవధిక పోటీ లేకుంటే (ఉపాధికోసం) పెట్టుబడిదారులపై వేతనాల పెంపు వంటి వాటికోసం ఒత్తిడులు పెరుగుతాయి. నూటికి నూరుశాతం మందికి ఉపాధి అవకాశాలు ఉన్న సమాజంలో నిరుద్యోగపు అభద్రతా భావం లేకపోవడమే దీనికి కారణం. ఆ అభద్రతా భావమే ఉంటే, అటువంటి సమాజంలోని వ్యక్తి మెరుగైన ఉపాధి పరిస్థితులు, వేతనాలకంటే తనకు భుక్తినిచ్చే ఉపాధిని కాపాడుకునేందుకు హెచ్చు ప్రయత్నం చేస్తాడు. నేటి భారతదేశ సమాజంలో ఉద్యోగాలలో రిజర్వేషన్ల అంశాన్ని

(మిగతా 21వ పేజీలో)

(6వ పేజీ తరువాయి)

**వెనిజులాలో అమెరికా ప్రేరేపిత సమ్మె నీరుకారిపోయింది :**

జనవరి 27వ తేదీ 2003న వెనిజులా బ్యాంకులు రెండు నెలలుగా సాగుతున్న చమురు సమ్మెకు వెన్నుదన్నుగా నిలవడం మానివేశాయి. అంటే వెనిజులా అధ్యక్షుడు చావేస్‌కు వ్యతిరేకంగా జరిగిన మరో కుట్ర కూడా విఫలం కావడానికి మరెంతో దూరం లేదు. వెనిజులా జాతీయ బ్యాంకింగ్ కౌన్సిల్ చెప్పినదాని ప్రకారంగా సోమవారం నుంచి (27 జనవరి తర్వాత) దాని సభ్యులు మరలా పనిలో చేరుతారు. రెండు నెలలుగా బ్యాంకింగ్ రంగంలో సహాయ నిరాకరణ నెలకొని ఉంది. బ్యాంకులు రోజుకి మూడు గంటలు మాత్రమే పనిచేశాయి. అలాగే దుకాణాలు, హోటళ్ళు, పాఠశాలలు కూడా సోమవారం నుంచి మరలా పనిచేయనారంభిస్తాయి. సమ్మె వలన ఏర్పడిన ఆహారం, ఔషధాలు, డబ్బు కొరతలు తమకు ప్రతికూలంగా పనిచేయగలవని పలువురు సమ్మె మద్దతుదారులు భయపడుతున్నారు. డిసెంబర్ 2వ తేదీన మొదలయిన ఈ సమ్మెలో పలువురు చిన్న వ్యాపారులు అసలు చేతులు కలుపలేదు. సమ్మెకు అనుకూలంగా బ్యాంకర్లు సహకరించిన తీరును వ్యతిరేకిస్తూ పలువురు సామాన్యులు బ్యాంకుల గోడలపై రాసిన నినాదాలు వెనిజులా సామాన్యుడి అభిప్రాయానికి అద్దం పడుతున్నాయి. ప్రజలు బ్యాంకుల గోడలపై ఇలా రాశారు : "బ్యాంకర్ దొంగలు!" తిరుగుబాటు కుట్ర దారులు!"

ఇక వెనిజులా ప్రతిపక్షం చేతిలో ఆ దేశ సామాన్య ప్రజల అభిమానాన్ని చూరగొన్న వామపక్ష నాయకుడు చావేజ్‌పై ముందుగానే ఎన్నికలు పెట్టించేందుకు వత్తిడి తెచ్చేందుకు మిగిలిన ఎకైక సాధనం. అమెరికా సామ్రాజ్యవాదుల అండే. వాస్తవానికి ఈ చమురు సమ్మె వెనుక కూడా అమెరికా హస్తం ఉన్నదని పలువురి అభిప్రాయం. ఏదేమైనా వెనిజులా ప్రజల మనోభీష్టాన్ని ఓడించడం ఎవరితరం కాదని కాలగతి, అక్కడ పరిణామాలు రుజువు చేస్తున్నాయి. ❐

(20వ పేజీ తరువాయి)

కూడా ఈ నేపథ్యంలో మనం పరిశీలించవచ్చు. నూటికి నూరుశాతం మందికి పూర్తి ఉపాధి కల్పించలేని మన సమాజం రిజర్వేషన్‌ను రెండంచుల కత్తిగా వాడుకుంటుంది. (అంటే దీనర్థం అసలు రిజర్వేషన్లే అవసరం కాదని కాదు) ఒక పక్క రిజర్వేషన్ల గారడీ ద్వారా ఓటు బ్యాంకును సంపాదించడం. మరొక పక్క రిజర్వేషన్ల పోటీ సమాజంలో పలువురికి ఉపాధి లభించడం లేదని భ్రమను కలిగించడం. అంటే దీనర్థం రిజర్వేషన్లు కావాలన్న వాళ్లందరూ లేదా అమలుపరుస్తున్న వాళ్లందరూ ఈ ఉద్దేశ్యంతోనే వ్యవహరిస్తున్నారని కాదు. కానీ ఈ తరహా "పోటీ" చుట్టూ పరిభ్రమించే ప్రపంచం మారనంత కాలం పూర్తి పరస్పర సహకారంతో మానవజాతి వికాసాన్ని చూడలేదు. ❐

(16వ పేజీ తరువాయి )

స్థితిలో వున్నాయి. ఇక ఈ దేశాల రుణభారం వడ్డీల చెల్లింపుభారం అదనంగా వీటిని పీడిస్తున్నాయని ద్రవ్యనిధే అంగీకరించింది.

ఈ విధంగా నేడు మొత్తం ప్రపంచ ఆర్థిక వ్యవస్థ ఒక తీవ్ర సంక్షోభంలో వున్నది. బయటపడే మార్గం లేక సామ్రాజ్యవాదం, పెట్టుబడిదారి వ్యవస్థలు దీనినుంచి గట్టెక్కించుందుకు పడరాని పాట్లు పడుతున్నాయి. ఇలాగే ఈ సంక్షోభం మరింత కాలం ముదిరితే 1930 నాటి తీవ్ర ఆర్థిక మాంద్యపరిస్థితి పునరావృతం కావడం తథ్యం. ఇది బహుశా పెట్టుబడిదారీ వ్యవస్థ చరమదశకు, మరణ శాసనానికి చిహ్నం కాగలదా అన్నది వేచి చూడవల్సిందే. ❐

(16వ పేజీ తరువాయి)

**ఉపయుక్త గ్రంథాలు :**


John Madeley - Big Business Poor Peoples - The Impact or Transnational Corporations on the World's Poor - Zed Books, London, 1999.

Anne O Krueger (ed.) - The WTO as an International Organization, Oxford University Press, 1998.

Public Interest Research Group - Gattastrophe - PIRG, Delhi, 1993.

Neil Botten and John McManns - Competetive Strategies for Service Organisations, Macmillan Press, 1999.

Ruth Kaplan - GATS Hand Book - The Internet.

Arun Kumar - The Black Economy in India, Penguin Books, 1999.

Nirmal Kumar Chandra - The Retarded Economies, Sameeksha Trust & OUP, 1988.

Ashok Mitra - Terms of Trade and Class Relations, Rupa & Co., Calcutta, 1979.


(నూతన ఆర్థిక విధానాలు ప్రవేశపెట్టి 10 సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా సుందరయ్య విజ్ఞాన కేంద్రం ఏర్పాటు చేసిన సదస్సులో సమర్పించిన పత్రం) ❐

# జనవరి 1-15, 2003

## రాష్ట్రం

1. రైలు ప్రమాదాలతో నూతన సంవత్సరం ప్రారంభం
వ్యవసాయ రుణాలపై ఆంధ్రాబ్యాంక్ వడ్డీ తగ్గింపు.
ఆసియా సోషల్ ఫోరం ప్రారంభం

2. విశాఖపోర్టు జాతీయ రికార్డు
రెడ్డి లేబరేటరీస్‌కు కార్పోరేట్ గవర్నెన్స్ అవార్డు
విద్యుచ్ఛక్తి ఛార్జీలు పెంచబోం - ముఖ్యమంత్రి
కె.జి. బేసిన్ ఆరో బావిలో మరో చమురు నిక్షేపం
వికటించిన మధ్యాహ్నం భోజనం పథకం ప్రారంభం
150 విద్యార్థులు అనారోగ్యం పాలు

3. సికింద్రాబాద్ - మన్మాడ్ ఎక్స్‌ప్రెస్ ప్రమాదం 18మంది మృతి
గవర్నర్ బర్నాలా ప్రమాణ స్వీకారం
మరో 64 కరువు మండలాలు-మొత్తం 933

4. గ్యాస్ సిలిండర్ ధర పెంపుదలకు ముఖ్యమంత్రి తీవ్ర వ్యతిరేకత
ఆర్.టి.సి. పై డీజిల్ ధర పెంపుభారం రు. 45 కోట్లు

5. సింగరేణి బొగ్గు గనులను ప్రైవేటీకరించడం
- ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్

6. మేం గాయపడ్డ పులులం - నక్సల్స్ హింసపై డి.జి.పి.
2002లో ఎన్‌కౌంటర్లలో 107 మంది మృతి.

8. భాగస్వామ్య సదస్సు ముగింపు రు. 17,204 కోట్ల పెట్టుబడికి ఒప్పందాలు

11. సిపిఐ జాతీయ సమితి సమావేశాలు హైదరాబాద్‌లో ప్రారంభం

## దేశం

1. సాఫ్ట్‌వేర్ ఎగుమతుల్లో కర్ణాటక ఫస్ట్. ఆంధ్ర మూడో స్థానం.
గాసోహోల్ (5 శాతం ఎథనాల్‌తో పెట్రోల్) విడుదల

2. హిందూత్వం తీవ్రవాదం కాదు - ప్రధాని
వాజ్‌పాయ్ 'నకిలి హిందు' -వి.హెచ్.పి.
పెట్రోలు, డీజిల్ ధరలు రూపాయి పెంపు

3. సైన్స్ కాంగ్రెస్ ప్రారంభం

4. వ్యూహాత్మక అణురక్షణ వ్యవస్థ ఏర్పాటు
తెహల్కా పానెల్ కొత్త అధ్యక్షుడు జస్టిస్ పూకన్
ఆధునిక వైద్యం దారిద్ర్యరేఖకు దిగువున వున్నవారికి అందుబాటులో లేకుండా పోయింది. (30 శాతం దేశ ప్రజలకు చాలా ఖరీదైన వైద్య పరీక్షలు అందుబాటులో లేవు) - భైరాన్‌సింగ్ షెకావత్, ఉపరాష్ట్రపతి

5. రెండవ భాగస్వామ్య సదస్సు అద్వానీ ప్రారంభం

6. బిఎస్ఎన్ఎల్ ఎస్టీడీ రేట్లు తగ్గింపు

7. ప్రపంచీకరణను వ్యతిరేకించండి
- మాజీ రాష్ట్రపతి నారాయణన్

9. కొన్ని దేశాల ఎన్.ఆర్.ఐ.లకే ద్వంద్వ పౌరసత్వం.

10. ఐ.సి.సి. కాంట్రాక్టుపై భారత క్రికెటర్ల సంతకాలు
అణ్వస్త్రాల ఒప్పందానికి ఉత్తర కొరియా గుడ్‌బై

12. ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడం - నాగాలాండ్ నాయకులు

13. తమిళనాడుకు కావేరి నీరు - కర్ణాటక అంగీకారం

14. మళ్లీ 40 పైసలు పెరిగిన పెట్రోలు ధర

# బడ్జెట్ కోతలు

కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ (కాగ్) నివేదిక ప్రకారం గత రెండు సంవత్సరాల్లో కొన్ని పద్దులపై విధించిన కోతలు ఈ విధంగా వున్నాయి :

| | అంశం | కోత (కోట్లలో) |
|---|---|---|
| 2000-01 | గ్రామీణ నీటి సరఫరా | 175.86 |
| | పట్టణ బలహీన గృహాలు | 40.89 |
| | సబ్సిడీ బియ్యం | 184.01 |
| | దళిత గిరిజన ప్లాన్ | 146.28 |
| | జె.ఆర్.వై | 35.45 |
| | రోడ్లు పనులు | 42.20 |
| | వినియోగదారుల సబ్సిడీ | 31.93 |
| 2001-02 | రోడ్ల మరమ్మతులు | 19.56 |
| | పెన్షనర్లకు డి.ఎ | 56.75 |
| | గ్రామీణ నీటి సరఫరా | 47.93 |
| | సబ్సిడీ బియ్యం | 348.82 |
| | పంటల భీమా | 18.84 |
| | పశు సంవర్ధన | 10.43 |
| | అటవీ సంరక్షణ | 48.75 |

-కాగ్ నివేదికలు

భారతీయ రాజకీయవేత్తలు, వ్యాపారస్తులు స్విడ్జర్లాండ్, లక్సెంబర్గ్ కేమన్ దీవుల్లాంటి దేశాల్లోని బాంకుల్లో దాచుకొన్న డబ్బు సుమారుగా 150 బిలియన్ డాలర్లు (72 వేల కోట్ల రూపాయలు) వుంటుందని అంచనా. ఇందులో అత్యధికభాగం భారతదేశం నుంచి ఎగుమతులకు తక్కువ ధర, దిగుమతులకు ఎక్కువ ధరలు వేసి సంపాదించినదే.

- ఎకనమిక్ టైమ్స్ 13 జనవరి 03

సెంట్రల్ విజిలెన్స్ కమీషన్ లోకాయుక్తలు, కరప్షన్ వ్యతిరేక చట్టాలు - ఇలా ఎన్నోవున్నా, లంచగొండితనం నేరం చేసినందుకు ముగ్గురంటే ముగ్గురు న్యాయ శాఖాధికారులు మాత్రమే శిక్షించబడడం దురదృష్టకరం. ఇది మన న్యాయ వ్యవస్థ దయనీయ స్థితిని తెలియ జేస్తుంది.

- ఎకనమిక్ టైమ్స్ 13 జనవరి 03

మన దేశం Scams, Scandals, Swindlers, Smugglers, Money Launders, హవాలా ఆపరేటర్ల దేశమైపోయినందుకు విచారిస్తున్నా. జస్టిస్ మిలాప్‌చంద్ జైన్, లోక్ అయుక్త సంఘం అధ్యక్షులు.

-ఎకనమిక్ టైమ్స్, 18 జనవరి 03

మొదటి ఏడు నెలల్లో విదేశీ సహాయం లావాదేవీల్లో గత సంవత్సరంలో రు. 710 కోట్లు మన దేశం నుంచి తరలిపోగా, ఈ సంవత్సరంలో రు. 4980 కోట్లు తరలిపోయింది.

- దక్కన్ క్రానికల్, 27 జనవరి 03

బాంకుల్లో 4000 బిలియన్ రూపాయలున్నాయి. కార్పోరేట్ రంగం నుంచి బాంకులకు కేవలం 300 బిలియన్ రూపాయలకు మించి డిమాండు లేదు. విదేశీ మారకం నిల్వలు 69 బిలియన్ డాలర్లు వున్నాయి. అలాంటి నేపథ్యంలో దేశంలో నిధుల కొరత వుండడం అంటే అది వట్టి నాన్సెన్స్.

బాంకింగ్ రంగం ప్రయివేటీకరిస్తే ఈ నాలుగు వేల బిలియన్ రూపాయలు పెట్టుబడి పెట్టడానికి ప్రభుత్వానికి అవకాశముంటుందా?

-అలహాబాద్ బాంక్ అధ్యక్షులు, ఎకనామిక్ టైమ్స్

అభివృద్ధి కార్యక్రమాలకోసం 85-90 మధ్య ఖర్చు 70 శాతం వుండగా, 00-01 నాటికి 60 శాతానికి తగ్గింది.

- అస్సోఛామ్, జూన్ 02

ఎనభై శాతం బాధ్యతలు మావి, కాని 80 శాతం ఆదాయం కేంద్రానికి వెళుతుంది.

- రాష్ట్ర ఆర్థిక మంత్రి, యనమల మార్చి 7, 2002

కేంద్ర ప్రభుత్వం కేటాయింపుల గురించి లెక్కలు అడిగినప్పుడు పెత్తనం వద్దని రాష్ట్రాలు అంటున్నాయి కాని ప్రపంచ బాంకుకు ప్రతీ పైసాకు లెక్కలు చెబుతున్నాయి. అలాంటపుడు కేంద్రానికి జవాబుదారీ తనం వహించేందుకు ఇబ్బంది ఏమిటి?

- వెంకయ్య నాయుడు 12, జనవరి 03

ప్రపంచంలో సాఫ్ట్ డ్రింక్స్ ఉత్పత్తిలో కేవలం ఒక్క శాతం మాత్రమే ఉత్పత్తి చేస్తుంది కాని ప్రపంచ మద్యం ఉత్పత్తిలో 20 శాతం ఈ దేశంలోనే జరుగుతుంది.

- ఎకనమిక్ టైమ్స్, సంపాదకీయం 21 నవంబర్ 02

రాష్ట్ర ఫైనాన్స్ అకౌంట్స్ 2001-02 నివేదిక ప్రకారం భూమి శిస్తు పద్దుకింద ఆదాయం రు. 1971.50 లక్షలైతే ఈ శిస్తు వసూలు కోసం ఖర్చు చేసింది రు. 2,142.11 లక్షలు.

- ఫైనాన్స్ అకౌంట్స్ 01-02

స్త్రీ విద్యావతి అయినా, నిరుద్యోగి అయినా, ఆమె ఎక్కువ కాలం ఇంటిపనులకే సమయం వెచ్చిస్తుంది. ఇంటి పనులు ఇంటి యాజమాన్యం షాపింగ్ పనులకు వారానికి సగటున వెచ్చిస్తున్న సమయం.

| విద్యార్హత | పురుషులు | స్త్రీలు |
|---|---|---|
| నిరక్షరాస్యులు | 7.8 | 34.2 |
| ప్రాథమిక స్థాయికి కింద | 6.9 | 32.7 |
| ప్రాథమిక | 6.6 | 34.0 |
| మాధ్యమిక | 6.5 | 35.5 |
| సెకండరీ | 6.1 | 37.1 |
| హయ్యర్ సెకండరీ | 6.2 | 35.5 |
| గ్రాడ్యుయేట్, ఆ పైన | 5.4 | 33.9 |

- ఎకనమిక్ టైమ్స్ 1 అక్టోబర్ 02

విదేశీ మారకం నిల్వలు జర్రున పైపైకి పోతున్నాయి. అంటే విదేశీ పెట్టుబడులు దేశంలో పెరుగుతున్నాయని కాదు. కొత్త పరిశ్రమలను పెడుతున్నారని కాదు. ఉన్న పరిశ్రమలను కొనివేయడానికే.

- ఎస్.ఎల్.రావు - ఎకనమిక్ టైమ్స్ 30 అక్టోబర్ 02